



శ్రీ వాణీ ఆర్ట్ కంబైన్స్



# పుట్టింటి గౌరవం

కథ-నిర్మాత: ఎన్.వి.సుబ్బరాజు * స్క్రీన్‌ప్లే దర్శకత్వం: పి.చంద్రశేఖరరెడ్డి B.A.,

మాటలు: మోదుకూరి జాన్సన్ B.A.B.L. * సంగీతం: సత్యం * ఫోటోగ్రఫీ: వి.వి.ఆర్.చౌదరి

అన్నపూర్ణా ఫిలిమ్సు



జెమిని వారి

# అందరూ మంచివారే

ఈస్ట్‌మన్‌కలర్

నిర్మాత-దర్శకుడు

**ఎస్.ఎస్.బాలన్**

## మనలో మాట

మా రచయితలకు, పాఠకులకు, ఏజెంట్లకు, ప్రకటనకర్తలకు అందరికి ఉగాది శుభాకాంక్షలు.

*   *   *

'శమంత — హేమంత' సీరియల్ ఈవారం నుంచి ప్రారంభమైంది. వర్ధమాన యువ రచయిత శ్రీ పి. వి. ఆర్. శివకుమార్ వయస్సు 24



సంవత్సరాలే. జన్మస్థలం మదరాసు. ఉద్యోగం హైద్రాబాద్ హెచ్. ఎమ్. టి. కంపెనీలో మెకానికల్ ఇంజనీరింగ్‌లో డిప్లొమో తీసుకున్నారు. సలభై కదలదాకా వివిధ పత్రికల్లో వచ్చాయని తెలియజేశారు. 'వలయం', 'తాత — మనుమడు', 'మరో ప్రపంచం' అన్న కథలద్వారా ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులకు పరిచితులు.

## వసంత నవరాత్రులు

వసంత నవరాత్రులు వసంతఋతువులో వచ్చే పండుగ రోజులు. ఇవి తెలుగువారి ఉగాది పండుగతోనే ప్రారంభమౌతాయి ఉగాదితోపాటు తొమ్మిది దినాలు అవిచ్ఛిన్నంగా వైభవంగా జరుగుతాయి.

సంవత్సరంలో వచ్చే నవరాత్రులలో వసంత, శరన్నవ రాత్రులు రెండూ ముఖ్యమైనవి. ఇవి ఆయా ఋతువుల ప్రారంభంలో వస్తాయి రెంటింటికీ మధ్య ఆరు నెలల వ్యవధానం. ఒకటి ఉత్తరాయణానికి సంబంధించినది, మరొకటి దక్షిణాయనానికి సంబంధించినది.

శరన్నవరాత్రులలో దేవీపూజ ప్రధానంగా ఉంటుంది కాబట్టి వాటికి దేవీనవరాత్రులనే నామాంతరం ఉన్నది వసంత నవరాత్రులకు ఏ నామాంతరమూ ఉన్నట్లు తోచదు. విష్ణుదేవునికి సంబంధించిన ఉత్సవాలిప్పుడు జరుగుతాయి కొన్నిచోట్ల రథోత్సవాలు జరగడం కానవస్తుంది.

ఇప్పట్లో వసంతఋతువు చైత్ర మాసంతోనే ప్రారంభమవుతున్నది. కాని వెనుకటి కాలంలో అలా లేనట్లుగానే తోస్తూ ఉన్నది.

పూర్వం మాఘ ఫాల్గుణాలే వసంతర్తువైనట్టు కానవస్తుంది మాఘశుద్ధ పంచమి వసంత పంచమిగా ప్రసిద్ధమయింది ఉత్తరదేశంలో కొన్ని చోట్ల ఇది ప్రముఖంగా కానవస్తుంది.

### వసంతాల పండుగ

ఫాల్గుణశుద్ధ పౌర్ణమినాడు వసంతోత్సవం జరుపుకోవడం సంప్రదాయంగా ఉన్నది. మన పంచాంగాలను బట్టిన్నీ, ప్రాచీన సంస్కృత కావ్య నాటకాదులను బట్టిన్నీ ఈ సంగతి స్పష్టమవుతున్నది. వినోదంగా ఒకరిపై ఒకరు వసంతాలు చల్లుకొని, ఆనందిస్తూ పండుగ చేసుకోవడం నాడు జరుగుతుంది. ఆ దినమే వసంతోత్సవాలకు ఒకప్పుడు ప్రారంభంగా ఉండేది. ఇప్పుడది హోలి (హోళికా) పండుగగా మారిపోయింది. వసంతాలు చల్లుకొనుటకు బదులుగా ఎర్రరంగు నీళ్ళూ, నల్ల రంగునీళ్ళూ వికారంగా ఉండేటట్లు ఒకరిపై ఒకరు పోసుకోవడం, అపహాస్యాలకు దిగడం సంప్రదాయంగా మారిపోయింది. అసలు విషయం విస్మృతమయిపోయింది ఇది, దక్షిణ దేశీయులకు కాక, కేవలం ఉత్తరాది వారికే ముఖ్యమయి పోయింది.

### డోలికోత్సవం

దక్షిణ దేశీయుల దృష్టిలో ఇది డోలా పూర్ణిమ లేక డోలికా పూర్ణిమనాడు కొన్ని క్షేత్రాలలో దేవతా విగ్రహాలను వైభవంగా పూరేగించి, ఒక ప్రత్యేక స్థానంలోని మంటపంలో ఉయ్యాల కట్టి, అందు ఆ విగ్రహాలను ఉంచి, పూచి ఉత్సవం చెయ్యడం ఇప్పటికీ చాలాచోట్ల కానవస్తుంది శ్రీకాకుళంజిల్లాలోని శ్రీ కూర్మంలో ఈ డోలోత్సవం ప్రధానంగా ఉంటున్నది

ఈ డోలికోత్సవమే క్రమంగా హోళికగానూ, హోళీగాను మారి ఉండినా ఉండవచ్చును. ఋతువుల్లో మొదటిది కావడంవల్ల వసంతఋతువుతో ప్రారంభమైన మాఘమాసం ఒకప్పుడు సంవత్సరానికి ప్రారంభంగా ఉండేదని అనుకోవచ్చు చైత్రం నాటికి గ్రీష్మర్తువు ప్రారంభమయేది ఋతు

## ప్రశ్నావళి

కె. రామలక్ష్మి

**వై. జె. ఆర్. భువనేశ్వర్.**

డబ్బున్నప్పుడే భర్తని దైవంగా పూజిస్తున్నారు స్త్రీలు. డబ్బు లేని పిమ్మట పనికిరాని దద్దమ్మగా భావిస్తున్నారు

చిత్రం. ఈ రోజుల్లో ఆడవాళ్ళకి బొత్తిగా మగవాళ్ళ బుద్ధులు వచ్చేస్తున్నాయి కదూ?

**రమేష్. ఏలూరు.**

మాటలతో విప్లవం ఎలా వస్తుంది అన్నారు. సాంస్కృతిక విప్లవం రాకుండా ఎక్కడన్నా విప్లవం వచ్చిందా?

మనలో మన మాట: సాంస్కృతిక విప్లవం కూడా మాటల వల్ల రాదు.

**ఎన్. బి. హెచ్. ఎమ్. కంచిలి.**

అక్కయ్యా, ప్రపంచంలో ధనము ముఖ్యమా? శీలము ముఖ్యమా?

తమ్ముడూ — ధనం ఉంటే— శీలం ఉన్నా లేక పోయినా శీల సంపన్నులుగానే కన్పిస్తారు.

**కె. పి. ఆర్. వి కర్నూలు.**

ఆడదానికి లొంగి, కీలు బొమ్మ అయి ఆడే వానిని ఏమనాలి?

ఆడదాన్ని కీలు బొమ్మ చేసి ఆడించే వారిని ఏమని అంటున్నారో— అదే అనాలి— బానిస.

**ఆర్. ఆర్. ఆర్. ధర్మసాగరం.**

మానవునికి తృప్తి నిచ్చేది ఏది?

అణకువైన భార్య. జిహ్వకు రుచైన భోజనం.

**ఎస్. వి. పి. బి మాచర్లారుపేట.**

నిజం నిలకడ మీద తేలుతుంది అంటారు. మరి అబద్ధం

అబద్ధం సత్తా మరుక్షణంలో తెలిసి పోతుంది.





ఇదుగో వెంకయ్యా! మా అబ్బాయి అందరికీ ఉగాది తలంట్లు పొయ్యాలిగాని— ఓ బస్తా కుంకుడు కాయలు పట్రా!!

సంహారంలో గ్రీష్మఋతువర్ణనే మొదట ఉన్నది. సంవత్సరారంభం చైత్రమనే భావంతో ఋతుసంహారిక కర్త ఇలా చెప్పి వుండాలి.

సంవత్సరం ఉత్తరాయణంతో ప్రారంభమయి, దక్షిణాయణం చివరితో ముగిసి పోవడం సౌర మాసం ప్రకారం సబబుగా ఉన్నది. మకర సంక్రమణంలో, ఉత్తరాయణం ప్రారంభమయినా సూర్యుని ఉత్తరదిశాగమనం మాఘమాసంలో గాని తెలియదు. రథ సప్తమి నాటికి తెలుస్తుంది. ఆనాడు సూర్యుడి గుర్రాలు దక్షిణంనుండి ఉత్తరంవైపు నడక ప్రారంభిస్తాయనీ, అందువల్లనే ఆ తిథి ఏర్పడినదనీ చెప్పారు.

వీటన్నిటివల్లా తెలుస్తున్న దేమిటంటే ఋతుగణం క్రమక్రమంగా మార్పు చెందుతునే ఉన్నదని, ఎంతో కాలంనుంచీ చైత్రమాస శుద్ధ పాడ్యమి మనకు ఉగాదిగానూ, వసంతర్తువుకు ప్రారంభంగానూ వాడుకపడింది. ఎండలు విపరీతంగా ఉంటున్నా, మనం చైత్రాన్ని చల్లని వసంత సమయంగా అనుకోవలసి ఉంటున్నది. కాలపరిగణనతో పాటు ఋతు ధర్మాలు కూడా మారిపోయాయి.

మార్పులు ప్రత్యక్షంగా కానవస్తున్నా చాలా పురాతనకాలంనుంచీ మనం పెద్దల పరిగణనే గ్రహించవలసి ఉన్నది. గ్రహించవలసి వున్నది కూడా. దాన్నిబట్టి ఉగాదితోనే వసంతం ప్రారంభమవుతుందనీ చైత్ర వైశాఖాలు వసంతఋతువనీ భావించాలి.

కాల పరిస్థితులు ఎలా వున్నా కష్టాలు శ్రమలు కొంతవరకయినా మరచిపోవడానికి ఆయాసమయాల్లో ఆయా వేడుకలు జరుపుకోవలసినదే!

— "అంగీరస"

# సుస్వాగత శుభగీతం

— దాశరథి —

ఇంకా నుంచున్నారేం ?
ఇగురించే తరులారా !
విరబూసే లతలారా !
స్వాగత నవ తోరణాలు
జగమంతట కట్టండి
వన వనాంతరములలోన
వసంతాలు నింపండి

ఇంకా మాట్లాడరేం ?
పికములార ! శుకములార !
లోకాలే పరవశింప
శ్రీకర గీతాలు పాడి
జీవుల మేల్కొల్పండి
నా ఉగాది వస్తున్నది
నవశకాది వస్తున్నది

ఇంకా చూస్తున్నారేం ?
ఇందీవర నయనలార !
కుంకుమ వెదజల్లండీ
పసుపు పంచిపెట్టండీ
ప్రసూనాలు పరచండీ
పరాగాలు విసరండీ
వస్తున్నది నా ఉగాది
నవజగతికి తొలిపునాది
ఈ దారినె వస్తున్నది
ఈ దారినె వస్తున్నది
సత్యము సుందరము శివము
సకల కళా మనోహరము
తెలుగులపాలిటి వరము
ఇలకుదిగిన సురపురము
జనహర్షము నవహర్షము
అదిగదిగో ! వస్తున్నది !
జనులారా ! స్నేహామృత
ధనులారా ! ఆనంద త
రుణులారా ! మంజీర చ
రణులారా ! ప్రణయ మణీ
ఖనులారా ! ఘనులారా !
అచ్చరవలె అరుదెంచెను
వెచ్చని పచ్చని ఉగాది!
సుస్వాగత శుభగీతం
పాడుట మన కర్తవ్యం

**ఎస్. వి. వి. ఆర్. జె. ఆర్. విజయనగరం.**

స్త్రీ బుద్ధి ప్రళయాంతక కాబట్టే నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి అన్నారు. దూషణ భూషణ తిరస్కారాలతో కాకుండా సౌమ్యంగా జవాబు యివ్వమని కోరుతున్నా.

ఎందుకంత భయం? న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి అనే ఏ మగవాడికైనా అసలు జవాబెందుకూ — ఎంత భాషా ప్రవీణులకైనా అలాంటి వూహలుంటే బుర్ర పెదగదు. బుర్ర లేని వాడికీ సంఘంలో స్థానం ఉండదు. రుద్రాక్ష మాల తిప్పుకుంటూ ఆడగాలి సోకని చోటికి పోవాలి వాళ్ళు.

**జి. ఎస్. ఆర్. పి. పటమట.**

మాకు చాలా పుస్తకాలున్నాయి. తరుచు చెదలు పడుతున్నాయి. వీటినుండి కాపాడు కోడానికి ఏదైనా సులభ పద్ధతి వుందా?

తేమ వల్ల పుస్తకాలకి చెదలు పట్టవచ్చు. పుస్తకాల గదికి గాలీ వెలుతురు వుండాలి. పుస్తకాలు నెలకోసారైనా దులిపి పెట్టాలి. నెప్తలిన్ లాంటివి వేస్తే కొంత నివారణ కలుగవచ్చు గాని, చెదలు, చిమ్మెటలు, సిల్వర్‌ఫిష్ యివి రాకుండా వుండాలంటే 'పెస్టు కంట్రోల్' వారిని సంప్రదించాలి వాళ్ళు ఏ మందులు స్ప్రే చేస్తే ఏం చేస్తే ఎలా చేయాలో చెప్తారు వారినే యీ పని 'పెట్టినా యింత' అని ఒప్పుకుని — అప్పగిస్తే — మరీ హాయి. ఎప్పటికప్పుడు చెక్ చేసి, నెలకోసారి మందు జల్లి వెడతారు నేను యింతే చేస్తాను.

**ఎల్. పి. ఆర్. హైద్రాబాదు.**

ఆడదానికి స్వతంత్రం యివ్వ కూడదు. ఏమంటారు?

మీ మగవాళ్ళ కెవరేనా పిలిచి యిచ్చారా స్వతంత్రం? స్వాతంత్ర్యం — ఎవరికేనా జన్మహక్కు.

**వి. ఎన్. ఆర్. కోటనందూరు.**

జాలి, దయ, కరుణ వీటిలో భేద మేమిటి ?

జాలి బడుగు జీవాల మీద చూపేది. దయ గాయపడ్డ వాళ్ళ మీద చూపేది. కరుణ సర్వ ప్రాణి కోటి మీదా చూపవలసినది.

**వి. ఆర్. కె. ఏదారు.**

పతిదేవుని పాద సన్నిధికి మించినది వేరే కలదా?

కలదు. బ్యాంకు పాస్ బుక్!

పతి ఆదరణ సతికి మోక్షము. . .

మోక్షం కాదు సతికి, కావలసినది — ప్రేమ.

**పి. పి. వికారాబాదు.**

అవినీతికి అలవడిన మానవుడు ఎప్పుడు మారుతాడు?

అవినీతి పట్టసమ్మతం చేసేసినప్పుడు !

**కె. ఆర్. ఎన్. వి. బి. చిప్పూరు.**

స్త్రీ జాతి పతనమై పోడానికి కారణం స్త్రీ జాతే నంటాను. ఏమంటారు?

కర్ణుడి — చావుకి కారణాల్లాగా. . యీ జాతి పతనానికి చాలా కారణాలుంటాయి.

**జి. పి. పాల్వంచ.**

మగాళ్ళపై తిరగబడే ఆడవాళ్ళపై మీ అభిప్రాయం?

తిరగబడ్డం మీ మగవాళ్ళ ప్రత్యేక హక్కు కాదు. కాదు కదా.

**ఆర్. ఎల్. విశాఖపట్నం.**

కోపంలో కూడా సౌమ్యంగా మాట్లాడే నేర్పు ఎందరికి వుంటుంది.

కోపంలో సౌమ్యం ప్రదర్శించే వాళ్ళు క్రూరులు. చాకచక్యంగా ఆలోచించి గొంతులు కోస్తారు. కోపంలో విరుచుకుపడే వాళ్ళే హాయి.

**ఎమ్. కె. ఆర్. ఎన్ కడప.**

'ఆడమ్', 'యీవ్' లు తిన్నది ఆపిల్ కాదు. ఫర్‌బిడెన్ పండు.

ఫర్‌బిడెన్ పండూ కాదు — 'విజ్ఞాన ఫలం' అందుకే అది మానవ మాత్రులు అంటరానిదైందా నాడు !

# ★✶ పండగకి — రెండు — పిండి వంటలు!

## అప్పరేలు

"అప్పరేలు" అంటే ఒక చక్కని పిండివంట.

కావలసిన వస్తువులు :

మైదాపిండి ఒక కిలో, పంచదార అరకిలో, డాల్డా అరకిలో, వెన్న 150 గ్రాములు, పాలు పావుశేరు.

తయారుచేసే విధానము

మొదట మైదాపిండిలో, 150 గ్రాముల వెన్నను వేసి, కాచిన పాలను, యీ మైదా పిండిలో కొస్త కొస్త పోస్తూ, పూరీలపిండి లాగ, గట్టిగా తడిపెట్టుకోవాలి. తర్వాత, యీ పిండిని నిమ్మకాయంత సైజులో, చిన్నచిన్న ఉండలుగా చేసుకుని, కొద్దిగా, బిస్కట్ల లాగా, ఒక్కొక్క ఉండని నొక్కాలి. యీ విధంగా, అన్నీ చేసుకున్న తర్వాత, పైన చెప్పిన పాళ్ళ ప్రకారము, పంచదారను తీగ పాకముపట్టి ఉంచుకోవాలి. తర్వాత, స్టౌ మీద బాణలి ఉంచి, డాల్డాను పోసి, బాగా కాగిన తరువాత, ఈ బిస్కట్లలాగా చేసుకున్న మైదా ఉండలను, అందులోవేసి, ఎర్రగా, దోరగా, వేయించుకుని, పంచదార పాకంలో వెయ్యాలి ఈ విధంగా అన్నీ వేయించుకుని పాకంలోవేసి ఒక పావుగంట ఉంచాలి. తరువాత వీటిని తీసి ఒక పళ్ళెంలో ఆరబెట్టి, ఆరిన తర్వాత డబ్బాలో పోసు కోవాలి. యివి చాలా రుచిగా, ఎంతో బాగుం టాయి. తయారుచేయటం చాలా సులువు. కనీసము మూడు నెలలయినా, పాడవకుండా నిలవ ఉంటాయి.




ఉగాది పచ్చడి పళ్ళూడిపోయేటంత పుల్లగా ఉన్నా పర్లేదు. నాపన్నీ కట్టుడు పళ్ళేగా!

## ఛుడుఫా

కావలసిన వస్తువులు :

అటుకులు అరకిలో. వేయించిన శనగ పప్పు అరకిలో. వేరుశనగపప్పు అరకిలో. జీడిపప్పు అర్ధపావు. కారం 5 చెంచాలు. కరివేపాకు 2 కట్టలు. ఉప్పు తగినంత.

తయారుచేసే విధానము : మొదట అటు కులూ, వేయించిన శనగపప్పూ వేరుశనగ పప్పూ, జీడిపప్పూ ఈ నాల్గింటినీ శుభ్రం చేసి ఈ నాల్గింటిని వేరువేరుగా కొద్ది కొద్దిగా నూనెను పోసి బాగా కరకరలాడే టట్లుగా మాడకుండా వేయించాలి. కరివేపా కును కూడా వేయించాలి. యిలా అన్నీ వేయిం చిన తరువాత అన్నింటిని ఒక విశాలమయిన గిన్నెలో వేసి ఉప్పూ, కారం, ఉంటే కొస్త నెయ్యీ వేసి బాగా కలపాలి. బాగా కలిపితే యిది పొడిపొడిగా అవుతుంది. అప్పుడు ఈ 'ఛుడుఫా'ని ఒక డబ్బాలో పోసుకోవాలి. ఈ 'ఛుడుఫా' చాలా రుచిగా చాలా బాగుంటుంది. దీనిని పిల్లలూ, పెద్దలూ ఎంతో యిష్టంగా తింటారు. యిది ఎన్ని నెలలయినా పాడవ కుండా ఘుమఘుమలాడుతూ, కరకరమంటూ నిలవ ఉంటుంది. —బి. రామలక్ష్మి

# ఈ వేసవిలో ఎక్కడ చెమట పేలుడు సంభవిస్తుంది?

ఎక్కడ పేలినప్పటికీ, జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరుతో అరికట్టండి. ఒక్క జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే 3 రకాలుగా పనిచేయు ఋజువైన ఔషధీయుక్త ఫార్ములా కలిగియున్నది.

- చెమటను పీల్చుకొని, చర్మముల రంధ్రములను మూసివేయుటను అరికడుతుంది
- క్రిముల పెరుగుదలను నిరోధిస్తుంది.
- చల్లదనం, హాయిని చేకూర్చి తక్షణ ఉపశమనము చేకూరుస్తుంది

స్నానము తదుపరి మరియు నిద్రపోవుటకు ముందు జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు విరళంగా చల్లండి. అది ఒక్కటే ఔషధీయుక్తమైన పౌడరు; చెమట పేలుడు నుంచి ఉపశమనమును కల్గించేది—తక్షణమే.

నుదురు

మెడ

బుజాలు

వీపు




చందనపు సువాసనలో కూడా దొరుకుతుంది.

## ఒక్క జాన్సన్స్* ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే మంటను ఆపుతుంది, దురదనుంచి ఉపశమనం ఇస్తుంది. తక్షణమే.



Johnson & Johnson*

OBM-4317 TEL

# రంగుల వల

పాలడుగు వెంకటేశ్వరరావు.

/గత సంచిక తరువాయి/

డాక్టర్ సుందర్రావు హాస్పిటల్లోనే వున్నాడు.

పేషంట్సుతో వూపిరి సలపకుండా వున్నాడు అతను.

భూషయ్యని చూసి 'నమస్కారం. కూర్చోండి' అన్నాడు.

'నమస్కారం' అంది వయ్యారంగా మంజుల.

'నమస్కారమమ్మా.' అని తన పనిలో మునిగిపోయాడు సుందర్రావు. ఆ మాట విని జాలికి గుటుక్కుమంది.

మూసుక్కున్న పేషంటుని చూసి అవతలకి పంపించి, చిర్నవ్వు నవ్వాడు డాక్టర్. నవ్వి 'చెప్పండి' అన్నాడు.

భూషయ్య మాట పడుపు ఏమిండా అయిపోయాడు. గుండెలు దడ దడ లాడేయి.

చలమయ్య పూనుకొన్నాడు.

'హైదరాబాద్ నించి ఎప్పుడు వచ్చారు?' అని అడిగేడు, చలమయ్య.

డాక్టర్ ఆశ్చర్యపోయేడు!

'హైదరాబాదా? నే నెప్పుడు వెళ్ళేను? ఎవరు చెప్పారు మీకు?' అన్నాడు.

చలమయ్య గుటుక్కుమన్నాడు.

'పాపం! మీ అప్పగారు పోయాకని తల్లి మీ బాబాయే మామగారు విచారంలో మునిగిపోయారు!' అన్నాడు చలమయ్య నోసు భూలిగా మొహం పెట్టి.

డాక్టర్ ఆశ్చర్యపోయేడు.

'ఏమిటి మీరు మాట్లాడుతూంటు?' అని అడిగాడు తీక్షణంగా.

'మీ గురించే. విచారంలో మీ మైండు సరిగా వున్నట్టు లేదు పాపం!' అంటు విచారం వెలిబుచ్చేడు చలమయ్య.

డాక్టర్ కొన్ని క్షణాలు అప్రతిభుడై పోయేడు!

'డాక్టర్‌గారు! ఇలారండి ఒకసారి. మీతో మాట్లాడాలి.' అన్నాడు చలమయ్య.

అవును. మాట్లాడాలి రండి.' అంటూ దారి తీశాడు డాక్టర్, అనుమానంగా.

ప్రక్కగదిలోకి వెళ్లేరు. భూషయ్య వాళ్లని అనుసరించేడు.

చలమయ్య అన్నాడు 'ఏమిటి డాక్టర్ ఇదంతా? మీకు కట్నం ఏమన్నా ఎక్కువ కావాలంటే చెప్పండి. అంతేగాని అంతా సెటిలయ్యాక ఇదేమిటి?' అన్నాడు సూటిగా.

'క్షమించాలి. మీరు మాట్లాడుతున్నది ఏమిటో నా కర్థంకావటంలేదు.' అన్నాడు డాక్టర్ అసహనంగా.

'సర్లెండి. మీ అన్నగారు పోయినందుకు నిజంగా మా కందరికీ విచారంగా వుంది.' అన్నాడు చలమయ్య.

'క్షమించండి. నాకు అసలు అన్నదమ్ములు ఎవరూ లేరు?' అన్నాడు డాక్టరు. చలమయ్య భూషయ్య మొహామొహాలు చూసుకున్నారు. భూషయ్య మొహంలో కత్తివేటుకి నెత్తురు చుక్కలేదు.

'ఇదేదో గందరగోళంగా వుంది. సర్లెండి. మీకు రాజారావుగారు తెలుసా? ఈ పెద్దమనిషి భూషయ్యగారు తెలుసా? వారి అమ్మాయి మంజుల తెలుసా?' అన్నాడు చలమయ్య.

డాక్టర్ అసహనంగా అన్నాడు. 'రాజారావుతో క్లబ్బులో కొంచెం పరిచయం వుంది. కొన్నాళ్ల క్రితం రాజారావు

**జరిగిన కథ 6 :** మంజులను పెండ్లాడే ప్రయత్నంతో వచ్చిన బోసుబాబును భూషయ్యబావ అవమానించి పంపగా, అక్క కాంతమ్మను సంప్రదించడానికి తానే వస్తాడు రాజారావు. మంజులకి నచ్చిన డాక్టర్ సుందర్రావు భూషయ్యకీ నచ్చుతాడు. సుందర్రావు అన్నయ్యతో మాట్లాడ్డానికి బయల్దేరి పిల్లి ఎదురుకాగా కొంత హతాశులై వెళతారు రాజారావు, భూషయ్యలు. హైదరాబాద్ వెళ్లి, సుందరరావు మేనమామ చలపతిగారితో అన్ని విషయాలు మాట్లాడి సంబంధం ఖరారు చేసుకుంటారు. అన్నగారు చనిపోతే సుందర్రావు హైదరాబాద్ వెళ్ళాడంటూ కాలయాపన చేస్తున్న రాజారావుతో అమీ తుమీ తేల్చుకోవాలని భూషయ్య కుటుంబంతో సహా వస్తాడు.

ఆ అమ్మాయిని పేషంటుగా నా దగ్గరకి తీసుకువచ్చేడు. ట్రీట్ చేశాను. ఆ తర్వాత వీరూ గుండెల్లో నొప్పని వచ్చారు. ట్రీట్ చేసేను. ఫీజు పుచ్చుకొన్నాను. రాజారావుగారే చెల్లించారు. దట్సాల్!'

'అంతేనా?!' అంటూ నోరు వెళ్లబెట్టేడు భూషయ్య.

'అదిసరే. ఈ భూషయ్యగారు క్రితంసారి ఇక్కడికి వచ్చినపుడు హైదరాబాద్ వెళ్లి మీ మేనమామ చలపతిగారితో అన్నీ మాటాడి సెటిల్ చేసేరు. ఆ సంగతి మీకు తెలిసే వుంటుంది' అన్నాడు చలమయ్య.

డాక్టర్ ఆశ్చర్యం ఎక్కువయింది.

'అసలు నాకు ఏ మేనమామలూ లేరు. ఆ చలపతి ఎవరో నాకు తెలియదు. వీరు వెళ్లి సెటిల్ చేసిన విషయమేమిటో అసలే తెలీదు' అన్నాడు.

భూషయ్య నవనాడులూ క్రుంగిపోయేయి.

'బాబూ! ఇదంతా వలలాగ వుంది. పోనీ. గతాన్ని మర్చిపోదాం. మా మంజు తల్లిని చూశారుగదా! కావాలంటే ఇంకొకసారి చూడండి. నీవు కోరిన కట్నం ఇస్తాము. అమ్మాయికి నువ్వు నచ్చావు. సరేనంటే వెంటనే ముహూర్తాలు పెట్టుకొందాము.' అన్నాడు ప్రాధేయ పూర్వకంగా, భూషయ్య.

ఈ లోగా చలమయ్య వెళ్ళి మంజులని పిల్చుకొచ్చాడు. సిగ్గుపడుతూ గోడవారగ విల



# నా శ్వాసలో శ్వాసించే నా ప్రియుడు



## నన్ను విడిచి క్షణం

నిర్మలమై, తాజా రుచి గలిన బినాకా గ్రీన్ నాకెంతో అవసరమైన ఆత్మ విశ్వాసాన్ని చేకూర్చుతుంది ముఖ్యంగా నేనతని చేరువనున్న మధుర క్షణాలలో ఎందువలనంటే, బినాకా గ్రీన్‌లో శ్వాసయొక్క దుర్వాసనను హరించి మీ నోటికి రోజంతా హాయి గొల్పే తాజా తనాన్నివ్వగల ప్రకృతి సిద్ధమైన దుర్గంధ సంహారక పదార్థము, క్లోరోఫిల్ ఉన్నది అందు చేత బినాకా గ్రీన్ నా కత్యంత ప్రియతమమైంది

నన్నింతగా ప్రేమించే నా ప్రియుణ్ణి కేవలం నా వాడిని చేసిన బినాకా గ్రీన్‌కు ధన్యవాదాలు

## స్వప్నంలో కూడా ఉండలేనంటాడు




## మా గాఢ అన్యోన్య ప్రేమకు కారణం- బినాకా గ్రీన్



బినాకా టూత్ బ్రష్‌కి గుండ్రటి కొనలు ఉంటాయి ఇగుళ్ళను ఏమాత్రం గాయపరచవు

CIBA GEIGY

Rediffusion/CG/ 94 e T4




"అమావాస్య" అని - నేను బయల్దేరడం మానుకోలేదు దీపావళి పండుగరోజు ప్రయాణమేమిటని డాక్టర్ సుదర్శనంగారే బలవంతంగా ఆపారు.

అంటా సర్దుకున్న సూట్‌కేస్ తెరిచి బట్టలు మార్చుకున్నాను టూత్‌పేస్టూ, బ్రష్ బయట పెట్టుకున్నాను రాత్రి, భోంచేసి పడుకోబోయేముందు కూడ పళ్ళు తోముకోవడం నాకు అలవాటు

డాక్టరుగారు చిల్డ్రన్ స్పెషలిస్టు వాళ్ళింట్లో చిన్నపిల్లలెవరూ లేరు అంచేత టపాకాయలు గట్రా ఎండలో పెట్టడంలాంటి హడావుడి లేదు వంటమనిషి గవరాజు ఓ వెదురు గంపనిండా ప్రమిదలు, కాస్తంత పత్తి ముందేసుకుని వాటికి వత్తులు చేస్తున్నాడు

పండుగనాడు కూడ డాక్టరుగారు ఇంటిపట్టున ఉండకపోవడం నాకు చిరాకెత్తించింది బొత్తిగా కంపెనీ లేదు గవరాజుతో ఎంతోసని మాట్లాడను? అప్పటికీ అతని కూడా కూచుని, వద్దంటున్నా 'అలూ' 'ఆనియన్స్' అవీ తరిగాను

సాయంత్రమయిందే, ఊళ్ళో టపాకాయల మోత, తారాజువ్వల చప్పుళ్ళు మొదలయ్యాయి ఆ ఒంటరితనం భరించలేక బజార్న పడదామనుకున్నాను ఏదైనా సినిమాకి చెక్కేద్దామనుకున్నాను కానీ డాక్టరుగారొస్తే

ఏమీ తోచక ఫోన్‌ముందు కూచుని ఓ నంబర్ డయల్‌చేసి ఏం మాట్లాడాలో తెలియక "విష్ యూ హేపీ దీపావళి" అని చెప్పి, ఎడంచేత్తో ఫోన్ని డిస్‌కనెక్ట్ చేశాను టెలిఫోన్ డైరెక్టరీ తిరగేస్తూ ఆ ఊళ్ళో ఉన్న వైన్ డీలర్స్ అడ్వర్టయిజ్‌మెంట్లన్నీ చదివాను టేబిల్‌మీదున్న తాళాలగుత్తిలో ఎన్ని చేతులున్నాయో లెక్కెట్టాను

"డాక్టరుగారున్నారా" అంటూ ఓ ఫోన్ వచ్చింది లేరని చెప్పాను

లేచి అటూ ఇటూ తచ్చాడుతుండగానే

# వారఫలం

మహేష్

18-4-1975 శుక్రవారం మొదలు
24-4-1975 గురువారం వరకు

మేషం — ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి మిత్రుల సహాయం లభిస్తుంది వారం ఆఖరులో మీ కార్యక్రమాలకు మార్పులు రాగలవు స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది బంధుమిత్రులను కలుసుకొంటారు

వృషభం — వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి సజ్జన సాంగత్యం లభిస్తుంది, మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగించగలదు సాటివారిలో గౌరవం బాగుంటుంది విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది ప్రయాణాలు ఫలిస్తాయి స్త్రీలకు—అనుకూలమైన వార్తలను వింటారు దైవ కార్యాలు నెరవేరతాయి

మిథునం — ప్రముఖజనంగల వ్యక్తులను కలుసుకొంటారు, ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి వృత్తిలో సాటివారి పోటీ తగ్గుతుంది మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి వారం ఆఖరులో సామాన్యమైన పనులకు కూడా ఎంతో కృషి చేయవలసి వస్తుంది స్త్రీలకు - ఆరోగ్యం బాగుంటుంది సాటివారిలో గౌరవం లభిస్తుంది

కర్కాటకం — మీ కార్యక్రమాలు బాగుంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతిలభిస్తుంది మీఆలోచనలు ఫలిస్తాయి అధికారులవలన జరగవలసినవ్యవహారాలు బాగుంటాయి మిత్రులకు సహాయంచేస్తారు స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

సింహం — మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి వ్యతిరేకమైన వార్తలనువింటారు వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది, నూతన వ్యవహారాలు లాభించగలవు, స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు, సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది

కన్య — ఆశించిన డబ్బు అందుతుంది మిత్రుల సహాయం లభిస్తుంది వారం మధ్యలో

చీకటి పడింది ఊళ్లో టపాకాయల మోత ఉధృతంగా ఉంది గవ్వరాజు దీపాలన్నింటినీ వెలిగించడం ముగించి, నూనె చేతుల్ని తుడుచుకుంటున్నాడు

డాక్టరుగారి కారు హెడ్ లైట్లజాడ లేదు జావామీద జర్కిన్‌తో పోతున్న వాడిని వెనగ్గా వాటేసుక్కూచున్న లావుపాటావిడని చూస్తే నాలో చొరవలేని నా తత్త్వంలో తడిసిన మతాబాయి మోగని సీమటపాకాయిలు

ఆరుబైట కొచ్చాను ఇంటి చుట్టూ ప్రదక్షిణ చేశాను పెద్దఇల్లే. అటు మూడు, ఇటు మూడు గదుల్ని కలుపుతున్న పెద్ద హాలు గదులకి కామన్ వరండా, వెనక వేర్వేరుగా రెండు వంటగదులు

ఇంటి రెండో పోర్షను వేపు చుట్టి వస్తుంటే కిటికీలో ఒక్కర్తే కూచుని చదువుతుంటున్న శైలజ కన్పించింది

ఆశ్చర్యం! తను ఉదయం నుంచీ నాకు కనపడలేదు!

పైగా, ఎదురుగా అదే గదికి తాళం వేసుంది. నన్నుచూసి నవ్వింది

ఆ నవ్వులో ఛిల్డ్రన్ స్పెషలిస్టు డాక్టర్ సుదర్శనంగారి అనుభవమంతా ఉంది

"బయట తాళంవేసి కూచున్నారేమిటి?" అన్నాను

"మరే" అంటూ నవ్వింది

ఛ! అలా ఎందుకన్నానా అన్పించింది పెద్ద పెద్ద ఇళ్ళలో మనిషి తక్కువైతే ఇళ్లలో మనుషుల్లేకపోతే అలా బయట తాళంవేసి ఉంచడం మామూలే

"టులెట్" బెడద తప్పించుకోవడానికి ఎవరన్నావస్తే ఇంట్లోఉన్న వాళ్ళందర్నీ డిస్టర్బ్ చెయ్యకుండా ఉండడానికి

శైలజని మళ్ళీ చూశాను తలవంచుకుంది

నేనూ శైలజా ఫిఫ్త్‌ఫారందాకా కలిసే చదువుకున్నాం డాక్టరుగారికి ఒక్కతే కూతురు గారాబంగా పెరిగిందేమో చాలా సెన్సిటివ్ గర్ల్ నా జామెట్రీ బాక్సులోని డివైడర్‌తో పుస్తకం కుడుతుంటే తనకు కోప్పడిన జ్ఞాపకం దాంతో కొన్నాళ్ళు నాతో పలకలేదు తనకి ఎ యు ఎ లో ఫస్ట్‌క్లాస్‌వస్తే నేనే "కంగ్రాట్స్" చెప్పాను

ఇంతకీ శైలజకి, ఉదయం నుంచీ నే నొచ్చినట్టు ఎందుకు తెలియలేదో!" తెలిస్తే ఫార్మల్‌గానైనా ఎందుకు పలకరించలేదో అర్థంగాక అడుగులు వేస్తుంటే పిలిచింది ఏమిటన్నట్టు చూశాను

"తలుపు తాళం తియ్యరూ"

అటు గది వెనక పొరపాటున గడియ పడిందేమో లోపల్నుంచి రావడం పడ్డలేదుగామోననుకుంటూ టేబిల్‌మీదనున్న తాళాల గుత్తి తెచ్చి రెండుమూడు కీ(ట్రయల్సు)తోనే తాళం తీశాను

అమ్మయ్య! శైలజ, డాక్టరుగారొచ్చేదాకా సరదాగా మాట్లాడితే బావుణ్ణు ముఖాన్ని గట్టిగా రెండు చేతుల్తో రుద్దుకుంటూ బయటికి వచ్చింది తను నాకు థాంక్స్ చెప్తుందని అనుకోలేదు అలాగే తను చెప్పలేదు నావేపు చూశ్లేదు పరుగెత్తుకుంటూ కాంపౌండు గేటుదాకా వెళ్ళి, గిరుక్కున వెనక్కితిరిగి నావేపుచూసి నవ్వుతూ నన్నక్కడే ఉండమన్నట్టు సైగ చేసి, కుడివేపుకి తిరిగి నెమ్మదిగ, తలవంచుకుని పక్కింటివేపు నడుచుకుంటూ వెళ్ళింది




రాధా నీ కళ్ళుకళ్ళు ఎంత బాగున్నాయో తెలుసా!!

గోవాలో ఓ ఇంటర్వ్యూకి హాజరై ఇంటికివెళ్తూ డాక్టరుగార్ని చూసినట్టుంటుందని ఈ ఉదయం దిగాను భోంచేసి వెళ్ళొచ్చుగాక్లే అన్నారు, భోజనాలయ్యాక "పండుగవ్వాడు ప్రయాణ మేమిటంటూ" ఉండమన్నారు ఇద్దరం నిద్రపోయాం నేను నిద్రలేచేటప్పటికిడాక్టరుగారికారు షెడ్లో లేదు

నాన్న, డాక్టరుగారు, డియరెస్ట్ ఫ్రెండ్ డాక్టరుగార్ని చూసి నేను చాలా ఏళ్ళయింది డాక్టరుగారిలో చాలా మార్పు వచ్చింది ఇదివరకటిలా, చిన్న పిల్లాడిలా, చిలిపిగా నవ్వుతూ, నవ్విస్తూ ఉండటంలేదు జోకులెయ్యడంలేదు వయసొచ్చిందిగదా జీవితంలో ఆ స్థాయి అలానే ఉంటుందేమో.

శైలజ మెడిసన్ చదివేప్పుడు, తన క్లాస్ బ్బాయే, సీనియర్ని ప్రేమించిందని నాన్న చెప్పేడు నాన్న, డాక్టరూ, కొన్నాళ్ళు శైలజకి సంబంధాలు వెదకారనుకొంటాను ఈ పాటికి శైలజపెళ్ళి కావలసింది కాలేదు

అతనికిమాత్రం పెళ్ళయిందని విన్నాను బహుశా అందుకేమో శైలజ మరింత

---

చికాకులు ఏర్పడతాయి సాహంక వ్యవహారాల్లో నష్టం వస్తుంది వారం ఆఖరులో ఒక్కి వ్యవహారాలు తిరిగి బాగుంటాయి స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది నూతన విషయాలను తెల్సుకొంటారు

**తుల** — వృత్తిలో ముఖ్యమైన వ్యక్తి అనుకుంటారు స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది వారం ఆఖరులో మీ అలవాటు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది అధిక వ్యయం జరుగుతుంది

**వృశ్చికం** —వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు విద్యా వైజ్ఞానిక రంగాలలో ఖ్యాతి లభిస్తుంది ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి స్థిరా వ్యవహారాలు బాగుంటాయి ప్రయాణాలు ఫలిస్తాయి స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు దైవకార్యాలు నెరవేర్తాయి

**ధనుస్సు** — లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును వృత్తిలో శ్రమ కలుగుతుంది వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి నూతన విషయాలను తెల్సుకొంటారు ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు పుణ్యకార్యాలు చేస్తారు

**మకరం** — ఇతరులతో కలసిచేసే వ్యాపారాలు బాగుంటాయి వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది ప్రయాణాల్లో ప్రయాసకు గురి కాగలరు వారం ఆఖరులో అనుకూలత లభిస్తుంది స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి బంధువులకు చికాకులు ఏర్పడతాయి

**కుంభం** — మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి రాజకీయ వ్యవహారాల్లో ప్రముఖులుగా గుర్తింపు ఉంటుంది ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి వారం ఆఖరులో వ్యతిరేకమైన మార్పులు రాగలవు స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది ఆడంబరంకోసం వ్యయం చేస్తారు

**మీనం** — వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి మిత్రుల సహాయం లభిస్తుంది [illegible] సందేహాలు కలుగుతాయి వ్యాపారంలో [illegible] పెరుగుతుంది నూతన వ్యవహారాలు [illegible] స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు [illegible] సంతానం సౌఖ్య సంతోషాలు లభిస్తాయి [illegible]

పెళ్లి చేసుకోనిది!

నాకు ఈ వాతావరణమంతా కృత్రిమంగా ఉంది రీడింగ్ రూమ్‌లోకి వెళ్లి లైటార్పేసి సర్ఫీలో పడుకున్నాను రాత్రంతా నిద్రలేదు. డాక్టరుగారు ఎప్పుడొస్తారో తెలీదు.

గవర్రాజు నిద్ర లేపేటప్పటికి రాత్రి తొమ్మిదిన్నర అవుతోంది డాక్టరుగారు ఆ పాటికే డైనింగ్ టేబిల్ ముందు కూచున్నారు పొగలు కక్కుతున్న చపాతీలు తిరగేస్తూ నా వేపు చూశారు

ఆయన రాత్రిళ్ళు భోంచేయరుగామోను!

నేనూ కూచున్నాను శైలజ 'రాదేమిటి అనుకుంటే...''బోరు కొట్టిందా''అనడిగారు.

''అబ్బే లేదండీ''అన్నాను

టపాకాయలు ఉండుండి మ్రోగుతున్నాయి. ఆకాశాన్ని అందుకోవాలని తారాజువ్వలు అందంగా వెలిగి ప్రయత్నిస్తూ...టపటపారాలిపోతున్నాయి.

చపాతీలు ముగించాం.

''ఏమిటీ . ? దన్నా మాట్లాడూ...'' బీరువా తెరిచి ఓ సీసా, రెండు గ్లాసులు తీసి, నన్ను ఆ ఫ్లాస్కు అందుకోమన్నాడు సీసాలో విస్కీ కనిపించగానే, ఫ్లాస్కులోది ఐస్ అయి ఉండాలనుకున్నాను.

డాక్టరుగారు ఇదివరలో తాగేవారు కారు సిగరెట్లు కూడా. నాకో సిగరెట్ ఆఫర్ చేశాడు.

''ఈ టపాకాయల మోతలు నాకు మహా ఎలర్జీ, అందుకే వెళ్లి క్లబ్‌లో కూర్చున్నాను. నువ్వున్నావనితెలిసికూడా...'' విస్కీ వంచుతూ అన్నాడు.

నేనేం మాట్లాడ లేదు

''కమాన్''...గ్లాసు నావేపు జరుపుతూ అన్నారు నేను ఉద్యోగం చేసేది బ్రుయరీస్‌లో అందుచేత అలవాటు ఉందో లేదో. అడగకుండానే ఆఫర్ చేశాడు

''నో ప్లీజ్...''అని ఇబ్బందిగా చూశాను.

''అదేమిటి...'' పసిపిల్లాడిలా ఆశ్చర్య పోయాడు.

''అది ఎలా తయారవుతుందో రోజూ చూస్తుంటాను గనక...'' అని నవ్వాను

''ఫెంటాస్టిక్'' అంటూ తనూ ఓ పెద్ద నవ్వు నవ్వి, ఒంటరిగానే మొదలెట్టాడు, గవర్రాజు, చక్రాల్లా తరిగిన ఉల్లిపాయలూ, ఆమ్లెట్లూ, సోడాలు ... తెచ్చి టేబిల్ మీద పెట్టాడు.

''చపాతీలు-విస్కీ-ఆమ్లెట్లు, బాగుంది కదూ ... '' అన్నారు, ఆమ్లెట్లని చేతితో నలుస్తూ...

నాకు శైలజ గుర్తు కొచ్చింది నాకు దూరంగా ఎందుకు తిరుగుతుందో అర్థం కావటంలేదు ''శైలజ టపాకాయలు కాల్చదా'' అన్నాను నవ్వుతూ

''అవునూ . శైలజకింకా పెళ్లి చేయలేదని మీ నాన్న అడుగుతున్నాడా?'' కళ్ల కొసల్నుంచి చూస్తూ అడిగాడు.

నేను మాట్లాడలేదు.

''నీకూ తెలుసన్నమాట!''

''ఏమిటి'' శైలజ భగ్న ప్రేమికురాలని తెలిసినా, తాగిన ఆయన మాట్లాడుతుంటే వినాలని అడిగాను.

''నీకు మూఢనమ్మకాల మీద నమ్మకముందా?'' సోడా బుసబుసల్ని సరదాగా చూస్తూ అడిగారు.

''ఉంది'' అన్నాను, తడుముకోకుండా.

(40 వ పేజీ చూడండి)

# కొన్నరెన్సులు అనబడే తిరునాళ్ళ కథలు

కవన శర్మ

(గత సంచిక తరువాయి)

జరిగిన విషయం వి వి. రావు ద్వారా విన్న పి. వి. రావు "పోన్లెండి గురుగారు. ఏదో అనుబవం" అన్నాడు

అక్కడితో కతవలా!

బెనర్జి ఆ కాయితాల్పుచ్చుకుని మూడేశ్వర్ దగ్గరకెళ్లాడు అవి జూస్తూనే

"మనమేదో పేపర్రాసినట్టున్నామే!" అన్నాడా పెద్దమనిషి బెనర్జి మాట్టాడలేదు. సాంతంచూసి ఆ పెద్దమనిషి.

"నా పేరెందుకెట్టలా?" అని వినయం గాను, వికృచ్చిగాను అడిగాడు.

"మీకు పాలనలోతేగాని పరిశోధనలో



ఏంటీ సంబంధం లేదన్నారు గదా!" అంటూ బెనర్జి చురకంటించాడు

మూడేశ్వర్ పగలబడి నవ్వాడు బెనర్జి వీపుమీద రెండు చరుపులు చనువుగా చరిచాడు చరిచాక మళ్లీ నవ్వాడు "పాలనంటే అందరికి పన్లు పంచిపెట్టడం, ఫలితాన్ని అందరోతోటు పంచుకోడం, అయినా ఈ లాబొరేటీనుంచి ఏ కాయితం నా పేర్లేకుండా బయటకి పోదుకదా! మరి ఈ పేపరు మాత్రం ఎట్టా పోతుంది?" ఈ మాత్రం తెలియకపోతే నువ్వు డి సైంటిస్టుని ఎట్టా లవుతావ్?" అని మందలించాడు

ఆ పైన అనే చనువుగా మూడేశ్వర్ బెనర్జి మరియు వి వి రావ్‌గా దిద్దాడు. దిద్ది ఓ క్షణం ఆగాడు "ఈ అయిదు కాయితాల పరిశోదనకి మూడు పేర్లెంటోగా లేదూ! మనిద్దరి పేర్లూ ఉంటే చాల్దూ!" అంటూ వి వి. రావ్ పేరు దీసిపారేసాడు. "అసలు పన్జేసిందతడు" అన్నాడు బెనర్జి బాదగా

"పన్జేస్తే ప్రమోషన్ కి రికమెండ్ చేద్దాం నువ్వు డి సైంటిస్టయినప్పుడతను సి అవుతాడు అంతేగాని ఈ పేపర్మీద అతనిపేరు పెట్టటం ఎందుకు?" పైగా ఈ కాన్ఫరెంచుకి పెద్ద పెద్దోళ్లంతా వస్తారు అక్కడికి మనలాంటి పెద్దోళ్లెళ్తేనే గౌరవంగా ఉంటుంది అయినా ముగ్గురి పేర్లుంటే ఇందులో ఎవరెవరు ఢిల్లీ వెళ్లాలన్న ప్రెశ్న వస్తుంది గవర్మెంటు కర్చులో ఉంది పొదుపు చెయ్యమంటోంది. ఇద్దరైతే ఏదో తంటాల్పడచ్చు, ముగ్గురైతే మంద మంద కాన్ఫరెంచు కెళ్లడానికి చేటు ఈ శ్రతినాగమ్మ అక్కడకి వచ్చినాఏం మాట్టాడగల్దు?" అంటూ మూడేశ్వర్ బెనర్జికి గ్నానబోద చేసాడు

అయితే నిజంగా అస్సల్విషయం దెల్సిన కుర్రాళ్లకి చాకచక్యంగా కప్పదాట్లువేస్తూ జవాబులు చెప్పాల్సిన అవసరంలేదని, కాన్ఫరెంచులో సరియైన జవాబులు చెప్తే తప్పించుకోవాల్సిన ప్రసక్తే లేదని ఈ పెద్దాళ్లు సరియైన జవాబు తెలియక ఏదో ఒకటి చెప్పి తప్పించుకుని, ఆ చాకచక్యమే ముక్యం అనుకుంటార్ట ఏదైతేనేం ఈ ఉపన్యాసం మూలంగా బెనర్జి మూడేశ్వర్‌తో లాలూచీ పడ్డాడు.

(36 వ పేజీ చూడండి)



# ఇప్పుడు!
# చల్లగా, తాజాగా ఉండండి సుదీర్ఘమై వెచ్చని వేసవి రోజంతా

మరియొక విద్యుచ్ఛక్తి కోత! నిజంగా రాబోతోంది సుదీర్ఘమైన వెచ్చని వేసవి. కాని చల్లగా. తాజాగా ఉండేందుకోసం ఇదుగో కొత్త మార్గం. స్నానం తదుపరి మీ శరీరంపైనంతా జాన్సన్స్ మెంథొలేటెడ్ పౌడరు చల్లండి. ఒక్క జాన్సన్స్ మాత్రమే **మెంథాల్** కలిగియున్నది. మిమ్మల్ని చల్లగా, తాజాగా ఉంచేందుకు, మీ చర్మాన్ని పొట్టురేగుట మరియు పేలుటనుంచి రక్షించి హాయిగా ఉంచేందుకు. వేసవి వేడిని తగ్గించండి వాడండి జాన్సన్స్ మెంథొలేటెడ్ పౌడరు.

# జాన్సన్స్* మెంథొలేటెడ్ పౌడరు

## '75 వేసవికోసం ఒకేఒక మెంథాల్-కూల్ పౌడరు.






Johnson & Johnson*

# ఆంధ్రపత్రిక హైదరాబాద్ సంచిక

*ఆంధ్ర పత్రిక (దిన పత్రిక) మార్చి నెల 27 వ తేదీనుంచి హైదరాబాద్ నుంచి కూడా వెలువడటం ప్రారంభమైంది.*

[ఆంధ్రపత్రికని 1908 లో దేశోద్ధారక శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు బొంబాయిలో ప్రారంభించి, 1914 లో మద్రాసుకు మార్చి, దిన పత్రికగా సార్థకనామ పత్రికగా రూపొందించారు. అదే ఒరవడిలో 35 సంవత్సరాలు 'పత్రిక'ను తెనుగువారి సాంస్కృతిక సామాజిక జీవితానికి అక్షరాల అద్దంగా, జాతీయ జీవన స్రవంతికి ప్రతీకగా శ్రీ శివలెంక శంభూప్రసాద్‌గారు తీర్చిదిద్దారు. సుమారు ఆరు దశాబ్దాల అనుభవంతో 1965 లో ఆంధ్ర పత్రిక విజయవాడ సంచిక ప్రారంభమైంది. మద్రాసులో నున్న 'సంచిక'ను ఆంధ్రుల రాజధానీ నగరం హైదరాబాద్‌కు తరలించాలన్న ప్రయత్నాలు ప్రారంభమైనాయి. కాని 1972 లో శ్రీ శంభూప్రసాద్‌గారి అస్తమయంతో అవి సఫలీకృతం కావటంలో కొంచెం జాగు తప్పలేదు ఈ ప్రాంతం వార్తలు అందించటంలో, సమస్యలను సన్నిహితంగా గ్రహించి; పత్రికలో ప్రతిబింబించటంలో, పాఠకులకు యితోధిక సేవలు చేయాలన్న 'పత్రిక' ధ్యేయం, పూనిక యిప్పుడు శ్రీ శివలెంక రాధాకృష్ణగారి సంపాదకత్వంలో సంపూర్ణంగా సానుకూలమైనాయని ఆనాటి ఉత్సవంలో పాల్గొన్న పెద్దలంతా అభిభాషించారు.]

ఇప్పుడు పత్రిక విజయవాడ నుంచి, హైదరాబాద్ నుంచి కూడా ఒకేసారి వెడువడుతున్నది

"తెలంగాణా రాయలసీమ పాఠకులకు యితోధిక సేవలు చేయటం" ముఖ్య ధ్యేయంగా ప్రారంభమైన ఈ సంచిక ప్రారంభోత్సవ వేడుకలకు రాష్ట్రపతి, ప్రధానమంత్రి, రాష్ట్ర గవర్నర్, యు పి గవర్నర్ మొదలు మంత్రులు, ప్రజాప్రతినిధులు, నాయకులు, కళాకారులు, కవులు వరకు అందరూ ఎంత ఆనం దాన్ని వ్యక్తంచేస్తూ పత్రిక అభివృద్ధిని, సేవలను ఆకాంక్షించుతూ సందేశాలు పంపగా, — దేశీయాంగ మంత్రి బ్రహ్మనందరెడ్డిగారు అధ్యక్షత వహించారు రాష్ట్ర ముఖ్యమంత్రి జలగం వెంగళరావుగారు సంచికకు ప్రారంభోత్సవంచేసి హైదరాబాద్ తొలి సంచికను రాష్ట్ర ఆర్థిక సమాచార శాఖామాత్యులు పి రంగారెడ్డిగారికి అందజేశారు

ఆంధ్ర పత్రిక సంపాదకులు శివలెంక రాధాకృష్ణగారు ఉత్సవానికి హాజరయినవారికి స్వాగతం చెప్పారు.

కాసు బ్రహ్మనందరెడ్డిగారు దాదాపు ఆరున్నొక్క దశాబ్దాలుగా 'పత్రిక' తెనుగు ప్రజల చరిత్రను తీర్చిదిద్దటంలో వహిస్తున్న పాత్రను శ్లాఘిస్తూ "రాజధాని నుంచి పత్రిక వెలువడుతున్న దంటే సంతోషించని వారుండరు దేశంలో పెద్ద రాష్ట్రమైన యీ రాష్ట్ర సమస్యల గురించి ఎప్పటివలె, ప్రజాసేవా ధ్యేయంతో కృషిచేసి యావత్ భారతదేశం దృష్టికి తేవాలని" ఆకాంక్షించారు జలగం వెంగళరావుగారు ప్రారంభోపన్యాసంలో తాతగారి తండ్రిగారి దీక్ష దక్షతలను పుణికి పుచ్చుకుని శ్రీయుతులు శివలెంక రాధాకృష్ణ, శివలెంక నాగేశ్వరరావుగారలు హైదరాబాద్ సంచికను వెలువరచటానికి కొనసాగించిన కృషిని కొనియాడి తెలుగువారి అభ్యున్నతికి పత్రిక హైదరాబాద్ ఆగమన హర్షాతిరేక శుభసమయంలో మరొక సారి అంకితం కావాలని అన్నారు. తొలి సంచిక అందుకున్న రంగారెడ్డిగారు యిప్పుడు అన్ని ప్రాంతాలకు సకాలంలో ప్రతు లందగల ఏర్పాట్లు జరిగాయని హర్షించారు

మాజీ మంత్రి మందుముల నరసింగరావుగారు, ప్రస్తుత ఆరోగ్య శాఖామాత్యులు కోదాటి రాజమల్లుగారు, విద్యుత్ శాఖా మంత్రి శ్రీ జి రాజారాంగారు మున్నగు వక్తలంతా యీ 'సంచిక' ఆగమనాన్ని, పత్రిక దీక్షను కొనియాడారు.

జంటనగరాలలోని అధికార అనధికార ప్రముఖులంతా హాజరై క్రిక్కిరిసి కూర్చొని వేడుకలలో పాల్గొన్న యీ సంచిక ప్రారంభోత్సవ సభకు వచ్చినవారిలో శ్రీయుతులు పి నరసారెడ్డి, పి. బసిరెడ్డి, భాట్టం శ్రీరామమూర్తి, బత్తిన సుబ్బారావు, జె చొక్కారావు, యస్ వెంకట్రామిరెడ్డి, వి. పురుషోత్తమరెడ్డి, సి హెచ్ దేవానందరావు, డి మునుస్వామి, పి. మహేంద్రనాథ్, యం వి కృష్ణారావు, తెలంగాణా అభివృద్ధి సంఘం అధ్యక్షుడు శ్రీ సి జగన్నాధరావ్, ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ యస్. భగవాన్‌దాస్, ఎడ్వకేట్ జనరల్ శ్రీ పి రామచంద్రారెడ్డి, రాష్ట్ర భాషా సంఘం అధ్యక్షుడు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, ప్రభుత్వ ఆర్థిక శాఖ కార్యదర్శి శ్రీ బి పి ఆర్ విఠల్, జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ యం. భోజారెడ్డి, ఛీఫ్ ఇంజనీర్లు, శ్రీ గణపతిరాం, శ్రీ భాగవతుల గోపాలకృష్ణమూర్తి, మాజీ మంత్రులు శ్రీయుతులు కోట్ల విజయభాస్కరరెడ్డి, రొండా నారపరెడ్డి మదన్‌మోహన్, రాష్ట్ర ప్రభుత్వ నదీ జలాల



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు, దేశీయాంగ మంత్రి శ్రీ బ్రహ్మనందరెడ్డి, ఆర్థికమంత్రి శ్రీ రంగారెడ్డి, విద్యుచ్ఛక్తి మంత్రి శ్రీ రాజారాంలు ఆంధ్రపత్రిక ప్రత్యేక సంచికను పరిశీలిస్తున్న దృశ్యం యింకా వేదికపై ఆసీనులైనవారిలో సభాపతి రేబాల దశరధరామిరెడ్డి, ఆంధ్రపత్రిక సంపాదకులు శివలెంక రాధాకృష్ణ, జనరల్ మేనేజరు శ్రీ కుంచితపాదం, శివలెంక నాగేశ్వరరావు, మందుముల నరసింగరావు ప్రభృతి ప్రముఖు లున్నారు
[అందరూ యీ ఫొటోలో లేరు]

# ప్రారంభోత్సవ విశేషాలు!

సలహాదారుడు శ్రీ మొదలి సీతారామశాస్త్రి, విద్యుచ్ఛక్తి శాఖ సూపరింటెండింగ్ ఇంజనీర్ శ్రీ సోమన్నచెట్టి, రాష్ట్ర సమాచార శాఖ డైరెక్టరు శ్రీమతి రాజ్యంసిన్హా, ప్రెస్ ఇన్ఫర్మేషన్ బ్యూరో అధికారి శ్రీ డి. ఆంజనేయులు, ఆకాశవాణి డైరెక్టరు శ్రీ సి. బాలగురుమూర్తి, పార్లమెంటు సభ్యులు శ్రీ కొమ్మారెడ్డి సూర్యనారాయణ, శ్రీ వెనిగళ్ల సత్యనారాయణ, సాహిత్య అకాడమీ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావు, సినీ నటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు, సినీ నిర్మాత శ్రీ దుక్కిపాటి మధుసూదనరావు, ప్రభుత్వ న్యాయవాదులు శ్రీయుతులు డి వి శాస్త్రి, యం. యస్. రాజలింగం, కర్మాగారాల చీఫ్ ఇన్‌స్పెక్టర్ శ్రీ నరసింహరాజు, పండిత శ్రీ అనుముల రామనాథశాస్త్రి, శ్రీ పుచ్చా సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీ నారాయణభట్ల కృష్ణమూర్తి శాస్త్రి, పలువురు శాసన సభ్యులు, శాసన మండలి సభ్యులు వున్నారు. ఆంధ్రపత్రిక చీఫ్ రిపోర్టర్ శ్రీ పి. వి. ఆర్. శర్మ వందనసమర్పణ చేశారు.

[ పి రా జీ ]



ఉత్సవానికి వచ్చిన (ఎడమ నుంచి) శ్రీమతి రాజ్యం సిన్హా, శ్రీ విమ్మగడ్డ రాజేంద్రప్రసాద్, శ్రీ అక్కినేని నాగేశ్వరరావు, (ఆ వెనుక) శ్రీ దుక్కిపాటి మధుసూదనరావు, డా. కె వి. రెడ్డి ప్రభృతులతో శ్రీయుతులు శివలెంక నాగేశ్వరరావు, శివలెంక రాధాకృష్ణగార్లనుకూడా చిత్రంలో (కుడిచివర) చూడవచ్చును.

# పాఠకుల ఎన్నికలో గెలిచాక

# బాధ్యత పెరిగింది! - శోభన్



ఆంధ్ర పత్రిక వార పత్రిక ఫిలిం బాలట్‌లో శోభన్‌బాబును ఉత్తమ నటుడుగా ఎన్నుకొన్న సమాచారాన్ని ఆయనకు అందచేసి, తత్సందర్భంలో నాలుగు మాటలను చెప్పమని అడిగాను. తనకు కలిగిన మధురానుభూతిని, భవితవ్యాన్ని వెల్లడించారు.

ఉత్తమ నటుడుగా ఎన్నికైనందుకు పుప్పొంగిపోయారు. బాధ్యత పెరిగింది అన్నారు. ప్రేక్షకులు యిష్టపడే విధంగా నటించగలనని వాగ్దానం చేశారు.

ఆ మధుర అనుభూతిని ఈ క్రింది విధంగా వివరించారు.

"ఇట్టి అమూల్యమైన అవార్డు వచ్చినప్పుడు, కలిగే ఆనందం వర్ణనాతీతం. పైగా, పాఠకులు అంటే ప్రేక్షకులు యిచ్చే తీర్పును సవినయంగా స్వీకరించి, ముమ్ముందు వారిని మరింత తృప్తి పరచడాన్ని కర్తవ్యంగా భావిస్తాను", అన్నారు అవార్డు విన్నర్.

"ఈ సంవత్సరం నాకు మరపురాని మధురమైన వత్సరం. ఇన్నాళ్ళదాకా నన్ను పుత్తమ సహాయ నటుడుగా నిర్ణయించిన పాఠక మహాశయులు, ఇప్పుడు పుత్తమ నటుడుగా ఎన్నుకొన్నారంటే, వాళ్ళు నన్ను ఎంతగా ప్రేమిస్తూ, అభిమానిస్తున్నారో అర్థమైంది" అంటూ పత్రికా ముఖంగా శోభన్‌బాబు కృతజ్ఞతలు తెలుపుతున్నారు.

"నేను ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించానని అనుకోను. కృషి లోపం మాత్రం వుండదని, ప్రేక్షకుల ఆదరణకు పాత్రమయ్యే విధంగా నటించగలనని హామీ యిస్తున్నాను' అన్నారు శోభన్.

"నాకిచ్చిన ఉన్నత స్థానాన్ని నిలుపుకోవాలన్నా, ప్రేక్షకుల ఆదరణ పోగొట్టుకోకుండా వుండాలన్నా కార్యదీక్ష, క్రమశిక్షణ అవసరం అని అనుక్షణం గుర్తుంచుకొంటాను. దినదిన ప్రవర్ధమానం అవనానికి కృషి సలుపుతూ మీరు నాపై పెట్టిన యీ బాధ్యతను సజావుసంతంగా నిర్వహించడానికే నా శాయశక్తులా శ్రమిస్తానని వాగ్దానం చేస్తున్నాను." ★

## 'దాసరి' చెప్పిన నాలుగు మాటలు!

ఆంధ్ర పత్రిక వార పత్రిక బాలట్‌లో ఉత్తమ దర్శకుడుగా దాసరిని ఎన్నుకున్న విషయాన్ని ఆయనకు తెలిపినప్పుడు, పాఠకులకు తన మాటగా నాలుగు వాక్యాలు రాయమన్నారు.

"అత్యధిక ప్రజాదరణ వున్న ఆంధ్ర పత్రిక వార పత్రిక పాఠకులు నన్ను మొదట్నుంచీ దీవిస్తూ, అభినందిస్తున్నారు.

1973 లో నేను దర్శకత్వం వహించిన "తాత – మనవడు" చిత్రాన్ని పుత్తమంగా ఎన్నిక చేశారు. రచయితగా నాకు ద్వితీయ స్థానాన్ని యిచ్చారు.

1974 కు నన్ను పుత్తమ దర్శకుడుగా ఎన్నుకుని నా బాధ్యతను, బరువును పెంచారు. నన్ను, నా చిత్రాలను యింతగా అభిమానిస్తున్న ప్రేక్షకులకు పత్రికా ముఖంగా కృతజ్ఞతలు తెలుపుతున్నాను" అన్నారు గదునరి.

అవార్డులపై మీ అభిప్రాయ మేమిటని అడిగాను.

అన్ని అవార్డులకు మించిన అవార్డు ప్రజలిచ్చే అవార్డేనని, అన్ని నిర్ణయాల కంటె గొప్ప నిర్ణయం ప్రేక్షకులిచ్చే నిర్ణయమేనని దాసరి అభిప్రాయ పడుతున్నారు.

ఆత్మ విశ్వాసం, వృత్తిమీద భక్తిభావం తనకు వున్నంత వరకు, ప్రేక్షకుల ఆశీస్సులు లభిస్తున్నంత వరకు, నవ్యత వున్న చిత్రాలను అందించడానికి సంశయించను అన్నారాయన.

రాబోయే చిత్రాలలో "బలిపీఠం, భారతంలో ఒక అమ్మాయి, బంగారు పతకం, స్వర్గం—నరకం, కలియుగ కృష్ణుడు" వైవిధ్యం వున్న కథా వస్తువును గొనియుండడంవల్ల, ప్రేక్షకులు బాగా రిసీవ్ చేసుకోగలరన్న నమ్మకం దాసరికి వున్నది. ★

### భిన్న ధృవాలు

రచయిత్రి మాదిరెడ్డి సులోచనగారి భిన్న ధృవాలుని చలనచిత్రంగా నిర్మించే హక్కును అనంతలక్ష్మి కంబైన్స్ అధినేత దగ్గుపాటి భాస్కర రావు పొందారు.

రామకృష్ణ — ప్రభ ప్రధాన జంటగా నటించే యీ చిత్రానికి పి. లక్ష్మీదీపక్ దర్శకుడు. మాటలను సత్యానంద్ రాస్తున్నారు. సంగీతానికి సత్యం, ఛాయాగ్రహణానికి రామకృష్ణ అధిపతులు. సహాయ పాత్రలను ప్రభాకరరెడ్డి, రమాప్రభ పోషిస్తారు.

ఏప్రిల్ చివరివారం షూటింగు ప్రారంభమవుతుంది. అన్నపూర్ణా విడుదల.

## నిర్మాత హనుమంతరావు అభిప్రాయం

[ఆంధ్ర పత్రిక వార పత్రిక నిర్వహించిన ఫిలిమ్ బాలట్‌లో ఉత్తమ చిత్రంగా పద్మాలయా పిక్చర్స్ వారి "అల్లూరి సీతారామరాజు" ఎన్నికైంది. ఆ చిత్ర నిర్మాత జి. హనుమంతరావు గారితో ఒక మినీ యింటర్‌వ్యూ చేస్తున్నాను.]

"జనం మెచ్చే చిత్రాలను నిర్మించడమే నా ధ్యేయం. అవార్డులకోసమో, క్రిటిక్స్ కోసమో చిత్రాలను నిర్మించే ఉద్దేశ్యం నాకు లేదు. అవార్డును ఆశించి ఎప్పుడూ సినిమాను తీసింది లేదు. ఇక ముందు కూడా ప్రేక్షకులను ఆకర్షించే చిత్రాలను నిర్మిస్తాను.

నే నిర్మించిన "పండంటి కాపురం, దేవుడు

### ప్రేక్షకులకోసం చిత్రాలు తీశాను

చేసిన మనుషులు, అల్లూరి సీతారామరాజు" చిత్రాలను ప్రజలు విపరీతంగా వీక్షించి, ఘన విజయాన్ని, బ్యానర్ వేల్యూని తెచ్చిపెట్టారు. విభిన్నమైన కథావస్తువును గొప్ప మూడు చిత్రాలు ప్రేక్షకులకు నచ్చడంకన్నా మించిన అవార్డు మరేదయినా యిన్నది గలదా?" అన్నారు హనుమంతరావుగారు.

"అల్లూరి సీతారామరాజు" చిత్రాన్ని పుత్తమ చిత్రంగా ఎన్నికచేసిన పాఠకలోకానికి కృతజ్ఞతలు తెలిపారు.

క్రిటిక్స్ వెలిబుచ్చే అభిప్రాయాలకు, ప్రేక్షకులిచ్చే తీర్పుకు పొంతన కలిగిన పద్మాలయా అధినేత మాటలలో సత్యం వున్నది.

వివరణకులు 'బ్రహ్మానందం' అన్న చిత్రాలు



*వర్ధించేవాళ్లు మనవాళ్లైతే .*

# ఉత్తమ నటి వాణిశ్రీ ఆనందం !



ఆంధ్ర సచిత్ర వార పత్రిక పాఠకులు మిమ్మల్ని ఉత్తమ నటిగా ఎన్నుకొన్నారని కావ్యనాయికతో చెప్పాను

"పాఠకులకు నా హృదయపూర్వక అభినందనము పత్రిక నిర్వాహకులకు నా కృతజ్ఞతలు" అంది

మీ జీవితంలో మరపురాని సంఘటనలు వున్నాయా అని ప్రశ్నించాను ఈ మధ్యే ఒకటి జరిగింది అంటూ చెప్పసాగింది

హీరో నాగేశ్వరరావుగారు నటించిన "దేవదాసు" చిత్రాన్ని చిన్నప్పుడు చూశాను ఆనాడు సావిత్రి, నాగేశ్వరరావుగార్ల నటనకు ముగ్ధురాలి నయ్యాను వాళ్ల పరిచయ భాగ్యం కలిగితే చాలు అనుకొన్నాను

విధి నన్నుకూడా సినిమా రంగానికి తీసుకొచ్చింది ఎవరితో పరిచయ భాగ్యము కలిగితే చాలు అనుకొన్నానో, అట్టి మహామహులయిన నాగేశ్వరరావు, సావిత్రి, రంగారావుగార్లతో అనేక చిత్రాలలో నటించడం జరిగింది

చిన్నతనంలో చెరగని ముద్ర వేసుకున్న "దేవదాసు" చిత్రం యిరవై రెండు సంవత్సరాల తరువాత విడుదలై, శతదినోత్సవం జరుపుకున్న సభలో నేను పాల్గొని, బహుమతీ ప్రదానం చేసినప్పుడు, నా ఆనందానికి అవధుల లేవు కలలో కూడా యిలాంటి సంఘటనను వూహించనయినా లేదు ఇట్టి అవకాశం అందరికీ రాదేమో అనిపిస్తుంది"

ఎందుకని అడిగాను

"రెండు దశాబ్దాల తరువాత విడుదలయ్యే ఏ చిత్రం అయినా శతదినోత్సవ వైభవానికి నోచుకోగలదా అన్న సంశయమే' అని వాణిశ్రీ చెప్పింది

మరేదైనా సంఘటన చెప్పగలరా ?

"తెలుగు సినిమా తారల కదంబ కార్యక్రమం ఆంధ్ర దేశంలో జరిగినప్పుడు, నేను బస్సులో వెనక సీటులో కూర్చునేదాన్ని, నా ఫ్రెండు రమాప్రభ ముందుకు వెళ్దాం రావే అని పిలిచేది వర్ధించేవాడు మనవాడయినప్పుడు ఎక్కడున్నా ఒక్కటే అని నేను చెప్పిన మాటలు నిజము నిజము అని నిరూపించిన ప్రేక్షక లోకానికి, జన్మ జన్మలకు ఋణపడి యుంటాను

"నాపై అభిమాన వర్షాన్ని కురిపించి, నన్ను సోదరిగా గౌరవించిన ఆంధ్రదేశ ప్రజలకు నా కృతజ్ఞతాభి వందనాలను తెలుపుతూ, వారి ఆత్మీయతను మరీ మరీ చూరగొనే విధంగా నటించగలనని సవినయంగా మనవి చేస్తున్నాను" ★

దారుణంగా దెబ్బతిన్న సంఘటనలు ఎన్నో వున్నాయి

సినిమాను వ్యాపారంగా పరిగణించి, ప్రేక్షకులకు ఏది కావాలో అద్దానిని అందించి, విజయాన్ని చవిచూడడంలో కలిగే ఆనందం, సంతృప్తి అవార్డుల ద్వారా వస్తుందనుకునే మనస్తత్వంకాదు, హనుమంతరావుగారిది

మెచ్చి యిచ్చే అవార్డులను ఆనందంగా స్వీకరించగల సంస్కారం హనుమంతరావుకు ఉన్నది

అవార్డుకంటూ సినిమా తీయరాదు అనేది నిశ్చితాభిప్రాయం వున్న ఆయనకు ప్రేక్షకుల ఆదరణ తోడుగా వుంటూ, హిట్ చిత్రాల నిర్మాణానికి ప్రోత్సహిస్తున్నది ★



*శ్రీ గౌతమ్ ప్రొడక్షన్స్ !*

తలపెట్టిన సాంఘిక చిత్రంలో సత్యనారాయణ నాయకుడి పాత్రను, జమున నాయిక భూమికను ధరిస్తారు కావలిపాటి విజయలక్ష్మి రాసిన "ఆవృతులు" నవల ఆధారంగా, సినిమాకు అవసరమైన మార్పులను చేసి, డి వి నరసరాజు సంభాషణలను, సినిమా అనువాదాన్ని సమకూర్చారు

ఈ చిత్రానికి డి యోగానంద్ దర్శకుడు. సత్యం సంగీత సారధి సంగీత సాహిత్యాలలో సమర్థత వున్న గౌతమీ రామబ్రహ్మం నిర్మాత

*జయసుధ ద్విపాత్రాభినయం !*

సత్యా ఎంటర్ ప్రైజస్ నిర్మిస్తున్న వర్ణ చిత్రంలో జయసుధ ద్విపాత్రాభినయం చేస్తున్నది. ఈ చిత్రానికి ప్రత్యగాత్మ దర్శకుడు కథకూడా ఆయనే రాశారు మాటలను, సినిమా అనుకరణను ఆయనే సమకూర్చారు

సత్య ఎంటర్ ప్రైజస్ నిర్మించిన తొలి చిత్రం "ఆడపిల్లల తండ్రి" బాగానే ఆడింది దర్శకుడు వాసుకు మంచి పేరును యిచ్చింది రెండవ చిత్రానికి వాసు నిర్మాత మాత్రమే

ఈ చిత్రంలో హీరోయిన్‌గా, వ్యాంపుగా జయసుధ వైవిధ్యమున్న పాత్రలను పోషిస్తున్నది ముఖ్య పాత్రలను నాగభూషణం, రాజబాబు, విష్ణువర్ధన్, గిరిబాబు ధరిస్తున్నారు సంగీతానికి చలపతిరావు, కెమెరాకు వి ఎస్ ఆర్ కృష్ణారావు అధిపతులు

తనయుడు వాసు చిత్రానికి తండ్రి ప్రత్యగాత్మ దర్శకత్వం నిర్వహిస్తున్న మొదటి రంగుల చిత్రం యిది. మే మొదటివారానికల్లా షూటింగు పూర్తవుతుంది.

"రక్త సంబంధాలు"లో మంజుల



# 'నవ్వుల బాబు

""ఆంధ్రపత్రిక బాలట్"లో మీరు ఉత్తమ హాస్య నటుడుగా నెగ్గారండీ" అన్న తమాషాల రాజబాబుతో 'అలాగా! ధన్యుడ్ని. ప్రజల అభిమానాలకు నేనింకా దగ్గరే వున్నాను. వారు కాసె చూపె ప్రేమ పాశాలకు నేనెప్పుడూ కట్టుబడి వుంటాను. జనావళికి దగ్గరైన నేను ఇంకా, ఇంకా దగ్గరై పోవాలని ఆశిస్తూ, అందుకనుగుణంగా నడచుకుంటానని మాటిస్తూ, వారికివే నా కృతజ్ఞతాంజలులు అర్పిస్తున్నాను" అన్నారు నవ్వులరేడు రాజబాబు.

అదృష్టం అన్నారు బాగుంది, మరి అనుభూతి సంగతేమిటి అన్న నా ప్రశ్నకు, 'ఎంత శాతంతో నెగ్గానండీ?' అంటూ ఎదురుప్రశ్న వేశారు. దాదాపు నూటకి తొంభై శాతం మీకే వచ్చాయిట! ఓట్లు అన్నాను. "అబ్బ!" అంటూ కాస్సేపు అలాగే నిలబడిపోయారు. ఏమిటండీ? అన్న నా మాట విని వులిక్కిపడి, 'అవధులుదాటిన ఆనందంలో పడి అసలు విషయమే మర్చిపోయాను.



తొంభై మార్కులు అనేప్పటికి మా నాన్నగారు గుర్తుకొచ్చారు. చిన్నప్పుడు నాకెప్పుడూ లెక్కల్లో తక్కువమార్కులొచ్చేవి. అది చూసి మా తండ్రిగారు "ఒరేయ్! ముప్పై, ముప్పై అయిదు దాటనంటున్నాయే నీ మార్కులు. ఎప్పుడు ఈ పరిధి దాటుతావో?" అంటుండేవారు. వారనుకున్న శుభదినం నేడొచ్చింది. నేను నూరు మార్కులకు చాలా సమీపంలో వున్నాను అనే విషయం జ్ఞప్తికొచ్చేసరికి నాకు పరమానందమైంది. ఈ అనుభూతిని నేను ఎప్పుడూ మరువలేను' అన్నారు రాజబాబు.

"ఉగాది శుభ సమయంలో పాఠకలోకానికి నా హృదయపూర్వక అభినందనలను తెల్పుతూ, ఓ శుభ వార్తను తెలియచేస్తున్నాను.

'త్వరలో "రాజబాబు పబ్లిక్ ట్రస్ట్" అనే నిధి నొకదాన్ని నెలకొల్పి అందులో నేను ఆర్జించే విత్తంలో కొంతభాగం ఇచ్చేసి, ప్రతియేటా బీద సాదలకు, ప్రజాహిత కార్యాలకు వినియోగపర్చాలనుకుంటున్నాను' అన్నారు మందస్మిత వదనంత సహృదయుడు రాజబాబు.

'బ్యాలట్‌ను ప్రతి వత్సరం సహనంతో నిర్వహిస్తున్న ఆంధ్రపత్రిక నిర్వాహకులకు నా కృతజ్ఞతలను తెలుపుకుంటున్నాను' అన్నారు రాజబాబు.

# రాజబాబు.

'సంతానం సౌభాగ్యం'లో కృష్ణ, విజయనిర్మల



## ఛాయాగ్రాహకుని చిత్ర నిర్మాణం

సెహభాష్ వేంకటరత్నం! బలే వేంకటరత్నం! అని ప్రేక్షకులచేత కీర్తింపబడుతున్న విఖ్యాత ఛాయాగ్రాహకుడు వెంకటరత్నం, యిప్పుడు కొత్త హోదాను అందుకొన్నారు. పల్లవి ఇంటర్నేషనల్ సంస్థకు అధినేత అయ్యారు. ఆయనతోబాటు ముఖర్జీ వున్నారు.

ఈ యిద్దరూ కలిసి ఈస్ట్‌మన్ కలర్‌లో తలపెట్టిన చిత్రానికి యిటీవల బాలమురళీకృష్ణ పాడిన శ్లోకాన్ని చక్రవర్తి రికార్డు చెయ్యడం జరిగింది.

హిందీలో విజయఢంకా మ్రోగించిన "దోయార్" చిత్రాన్ని తెలుగులో పలసిన మార్పులతో రూపొందిస్తున్నారు. విక్టరీ మధుసూదనరావు ఈ చిత్రానికి సత్యానంద్ రచనను, చక్రవర్తి సంగీతాన్ని, కృష్ణారావు కళను, వెంకటరత్నం ఛాయాగ్రహణాన్ని, సంజీవి కూర్పును నిర్వహిస్తున్నారు.

"నాయింటి దేవుడు"లో రాఘవన్, విజయలలిత



## "రెండు జంటల కథ"

ప్రేక్షకులు యిష్టపడే రెండు జంటలు యీ చిత్రంలో నటిస్తున్నారు. శోభన్ — మంజుల, కృష్ణంరాజు — చంద్రకళ. వీరితోబాటు ప్రభాకర రెడ్డి, నిర్మల, ఛాయాదేవి ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు.

లక్ష్మీ ఫిలింస్ విడుదల

## జగదీష్‌కు వేరొక చిత్రం

ఎడిటింగులో ఎన్నో ఏళ్ల అనుభవం గడించిన జగదీష్ దర్శకుడయ్యాడన్న వార్తను రెండు వారాల క్రితం రాశాను. ఆ వార్త వ్రాసిన పదిరోజులకల్లా తనకు మరొక చిత్రం వచ్చినట్టు జగదీష్ చెప్పారు. కొత్త చిత్రం వివరాలు: సంస్థ పేరు శ్రీదేవి మూవీస్. నిర్మాతలు కట్టమూరి లలిత, కంచర్ల జగతిబాయి. కథ — మాటలు ప్రముఖ రచయిత ఆనందరామం, కెమెరా పుష్పాల గోపీకృష్ణ, సినిమా అనుకరణ త్రిపురనేని మహారథి, కళ రామలింగం, ప్రొడక్షన్ కిషన్‌మంత్రి, సత్యనారాయణ, సంగీతం జె. వి. రాఘవులు.

రాఘవులు యీ చిత్రానికిగాను దాశరథి రాసిన "మిద్దెమీద మిద్దెగట్టి" పాటను, సుశీల పాడగా రికార్డు చేశారు.

ఈ చిత్రంలో నాయక పాత్రను రాఘవ, నాయిక పాత్రను గీతమాలిని పోషిస్తున్నారు. సహాయ భూమికలను కొత్త పాతలు ధరించగలరని తెలిసింది. ఇది వర్ణ చిత్రం. పి. శివరామిరెడ్డి నిర్మాణ నిర్వహణలో యీ చిత్రం ఆంధ్రదేశంలో నిర్మితమవుతుంది.

ఎడిటరుగా పేరు తెచ్చుకొన్న జగదీష్ డైరెక్టరుగా ప్రతిష్ఠ రావాలి.





పైన ''వకం రిజ''లో రామకృష్ణ, జమున
క్రింద ''భారతంలో ఒక అమ్మాయి''లో జయచిత్ర, మురళీమోహన్

## ఫీ పాడిన రమ్యమైన రాగాలు

శ్రీ భాస్కర చిత్ర అధినేత పుండరీకాక్షయ్యకు హమ్మద్ రఫీ అంటే ఎనలేని ప్రేమానురాగాలు ంటసాలగారు వున్నప్పుడే రఫీచేత పాడించారు మరి, యిప్పుడు పాడించకుండా వుండగలరా ?

''గీత్'' చిత్రంలోని పాటలను రఫీ తప్ప మరొకరు పాడలేరు. అందుకనే, ఆయన్ను పిలిపించి పాడించారు.

మార్చి మొదటివారం ప్రసాద్ రికార్డింగ్ ధియేటర్ శ్రోతలకు మధురానుభూతిని కలిగించింది. రఫీ పాడిన అయిదు పాటలు అద్భుతంగా వున్నాయి అని చెప్పక తప్పదు. రఫీ పాడిన రమ్యమైన రాగాలను వినడానికి వెయ్యి చెవులున్నా చాలవు.

ముఖ్యంగా లైలామజ్నుల సంగీత రూపకం మళ్లీ మళ్లీ వినాలనిపిస్తుంది

''లైలా లైలా లైలా !
నిరుపేద మనసునే మురిపించి నీవు
రతనాల మహలులో నిదురించినావా లైలా

జానకితో రఫీ కలిసి పాడిన పాట ఈమధ్య కాలంలో రాలేదు

లైలాగా వాణిశ్రీ, మజ్నుగా నటరత్న నటించే స్వప్న దృశ్యంకోసం ఈ పాట రికార్డు చెయ్యబడింది సంగీత దర్శకుడు హనుమంతరావును, రఫీ కవుగిలించి ప్రశంసించారు

ఈ చిత్రానికి బి పి ప్రసాద్ దర్శకుడు అన్నపూర్ణా విడుదల

### కలియుగ కృష్ణుడు

చిత్రానికి దాసరి నాలుగు బాధ్యతలను నిర్వహిస్తున్నారు (దర్శకత్వంతోబాటు మాటలు, సినిమా అనువాదం + కథలో కొంత మార్పు) ఈ చిత్రానికి తమిళ కలియుగ కన్నన్ మూలం

ఇందులో రామకృష్ణ కృష్ణుడుగా నటించ, మిగతా పాత్రలను అల్లు రామలింగయ్య, రాజబాబు, చంద్రమోహన్ పోషిస్తున్నారు ఈ చిత్రానికి సత్యం సంగీతసారధి

### ఎందుకీ కలర్ చిత్రాల పెరుగుదల !

ప్రేక్షకులు వర్ణ చిత్రాలు వీక్షించడానికి ఎక్కువగా యిష్టపడుతున్న నిజాన్ని ఎవరూ కాదనలేరు రంగుల చిత్రం చూస్తున్నంతసేపు, హాయిగా, తీపిని ఆస్వాదిస్తున్నవిధంగావుంటుంది

ప్రేక్షకుడు కోరేది మానసోల్లాసాన్ని మాత్రమే అన్న నిజానికి నిదర్శనమే హిందీ చిత్రాల అమోఘ విజయం

కలర్ చిత్రం యొక్క టిక్కెట్టు వెల ఎంతో, 'నలుపు—తెలుపు' చిత్రానికి కూడా అంతే అవడం చేత, వర్ణ చిత్రం చూడాలన్న ఆసక్తి, ఆనందం ప్రేక్షకుడికి వుండడంలో ఆశ్చర్యం లేదు

మారుతున్న ప్రజల అభిరుచికి అనుగుణంగా, నవనాగరీక జీవితానికి అలవాటుపడ్డ మనుష్యుల మనస్తత్వానికి దగ్గరగా వుండే చిత్రాలలో కథకన్నా కన్నుల పండుగ చేసే కమనీయ దృశ్యాలకే ప్రాముఖ్యత యివ్వవలసివస్తుంది గనక, అట్టి ఫీస్ట్ ఎఫెక్టును యివ్వగల కెపాసిటీ కలర్‌కు మాత్రమే వున్నది

విడుదలవుతున్న కలర్ చిత్రాల విజయ పరంపరలను చూస్తుంటె, భారీ సెట్టింగులు, సంగీతం, ఫయిట్లు, శృంగార దృశ్యాల పట్ల ప్రజలకు మోజు వున్నట్టు తెలుస్తూంది

హిందీ చిత్రాలకు విదేశీ మార్కెట్టు వుంది.



''అయినవాళ్లు''లో గిరిజారాణి, మిశ్రో

ఏరియా పెద్దది అందువల్ల ఖర్చుకు వెనకాడనవసరంలేదు

కాని, తెలుగు చిత్రాలను ప్రదర్శించడానికి ధియేటర్లు కూడా లేవు కాంపిటీషన్‌లో తట్టుకోవాలంటె, హిందీకి మల్లె తెలుగువాళ్లుకూడా కలర్ చిత్రాలు తీయక తప్పిందికాదు

ఒకసారి కలర్‌కు అలవాటుపడ్డ ప్రేక్షకుడు, 'నలుపు—తెలుపు'ను చూడడానికి యిష్టపడడు

కష్టమో, నష్టమో నిర్మాతలు భరిస్తూనే వున్నారు ఎక్కువ ఖర్చుపెట్టి కలర్ చిత్రాలను నిర్మిస్తూ వున్నారు ముమ్ముందు ''బ్లాక్ అండ్ వైట్''కు చోటు వుండదేమో

— శ్రీనివాస్

''రాముని మించిన రాముడు''లో వాణిశ్రీ, రామారావు



మీ ముఖము చూచి
మెచ్చుకొనేవారెందరో. మీ చర్మమునకు
చెరుపుచేసేవారూ ఉన్నారు
పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్
సహాయమును పొందండి

పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ మీ చర్మమును గాలి, దుమ్ము, వాతావరణములనుండి కాపాడుతుంది. దానిలోగల ఒక ప్రత్యేకపు హ్యూమెక్టంట్ చర్మమును తడి ఆరకుండా ఉంచుతుంది. దానివల్ల మీ ముఖము నున్నగా, జిడ్డులేకుండా ఉంటుంది. పౌడరు రాసుకొనేముందు దాన్నివాడితే దివ్యంగా ఉంటుంది. మీ మేకప్ తాజాగా, అందంగా గంటలతరబడి నిలుస్తుంది. లేదా, దాన్ని పూర్తి మేకప్‌గా వాడినా మంచిదే. జ్ఞాపకముంచుకోండి —మిమ్మల్ని మెచ్చుకొనే వారున్నట్లే, మీ చర్మమును మెచ్చుకొనేవారూ ఉండాలి

పౌడరు రాసుకొనేముందు వాడుటకు దివ్యమైనది

# పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్—




చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపితము)

రంగుల సంగీత వైభవం!

ఏ.వి.యం. రిలీజర్ సమర్పించు

మారుతీ ప్రొడక్షన్స్

# బాబు



ఈస్ట్‌మన్ కలర్

దర్శకత్వం కె. రాఘవేంద్రరావు బి.ఎ.

నిర్మాత ఏ.యల్. కుమార్ బి.ఇ.

లక్ష్మీ ఫిలింస్

సీరియల్

# రమంత - హేమంత

పి.వి.ఆర్. శివకుమార్

"ఎన్నిసార్లు చెప్పాలి హేమా, నేను రానూ...రానూ ... రానని ? దయచేసి నన్ను విసిగించక అవతలికి వెళ్తావా ?"

ఆదిత్య కంఠంలో హఠాత్తుగా చోటు చేసుకున్న కరకుదనానికి ఆశ్చర్యపడి ... ఆ వెంటనే చిన్నబోయిన ముఖంతో వెనక్కు తిరిగింది హేమంత.

"ఏమిట్రా అన్నిసార్లు చెప్పింది ? ఎందుకు వెళ్లవు ? యింటికి వచ్చిన పిల్లని చిన్నబుచ్చటమేనా ప్రజ్ఞ ? మహాతెలివితేటలు నేర్చుకుంటున్నావులే యీమధ్య !"

ఆపుకోలేని కోపంతో మేడమెట్లు దాటి, గదిలోకి వస్తూ అంది ధనలక్ష్మి. మనవరాలి ముఖం చిన్నబోవటం, అదీ తనమూలంగా, సహించలేకపోయిందామె.

ఎన్నడూ పరుషంగా మాట్లాడని తల్లి నోటి నుండి వెలువడ్డ ఆ మాటల్తో హతాశుడయ్యాడు ఆదిత్య.

మారు మాట్లాడకుండా లేచి, డ్రెస్ మార్చుకోసాగాడు. ధనలక్ష్మి గిరుక్కున వెనుదిరిగి, క్రిందకు నడిచింది.

గదిలో, కిటికీలో గడ్డాన్ని ఆనించి, ఆ ప్రక్కనే వున్న సోఫాలో కూర్చుని బయటకే చూస్తోంది హేమంత.

"లేమ్మా హేమా ! లేచి బట్టలు మార్చుకో. వాడు వస్తున్నాడు." అంటూ ఆమెని సమీపించిన ధనలక్ష్మి, చుబుకాన్నిపట్టి తనవైపుకు త్రిప్పుకున్న హేమ కళ్లలోని నీళ్లు చూసి అదిరిపడింది !

"హేమా, ఏడుస్తున్నావా ? వాడి మాటలకే ! ? ఛ ... ఛ ... నీకు తెలియదమ్మా, వాడి మనసు — వెన్నలాంటిది. ఆ మృదుత్వాన్ని పునరుజ్జీవింప చేస్తావన్న ఆశతో నా వెంటతెచ్చిన, నువ్వు, యిలాటి అదిలింపులకే, ముఖం మాడ్చుకోవటం... మంచిదికాదమ్మా !

వాడు తప్పక మారతాడు. మారి తరువాత నీ సాహచర్యంలో మునపటి మనిషై తిరుతాడు.

ఈ వూరికి ట్రాన్సఫరై వచ్చినప్పట్నుంచీ యీ 'శని' పట్టిందిగానీ, అంతకుముందంతా ఎంత చిలిపిగా, ఎంత చైతన్యంగా, ఎంత హాయిగా వుండే వాడు ! ఆ చలాకీతనం మళ్లీ నీతోనే రావాలి వాడికి ! ..."

మెట్లమీద 'టకటక' వినపడ్డ బూట్ల చప్పుడుతో గబుక్కున ఆ పేసి, "లే హేమా ! తయారుకా ! వాడు వచ్చేస్తున్నాడు" అని, తను ఆ గదిలోంచి బయటికి నడిచింది ధనలక్ష్మి.

చివరి మెట్టుమీద ఒక కాలు, నేలమీద మరో కాలు మోపి, కుడిచేతితో రెయిలింగ్ పట్టుకు నిలబడివున్నాడు ఆదిత్య.

బ్రౌన్ సూటులో, నీలం రంగు టైతో, హుందాగా నిలబడివున్న కొడుకును చూడగానే అప్రయత్నంగా కళ్లనీళ్లు తిరిగాయి ధనలక్ష్మికి.

'అచ్చంగా ఆయన విగ్రహం. యీ అందానికీ, హుందాతనానికీ తోడుగా ఆ చిలిపిదనమూ వుంటే ఎంత బాగుండేది ! ఎందుకు మాయమైపోయేయి అతడిలోని ఆ ఉత్సాహమూ, చిలిపిదనమూ ?'

"అయిందా నీ మనుమరాలి అలంకరణ ?" విసురుగా అడిగాడు ఆదిత్య.

"వస్తోంది. నువ్వు అలా సీరియస్‌గా, కరవొచ్చేట్టుగా మాట్లాడితే, పాపం, దానికి సరదా ఏముంటుందిరా ?"

తల్లి మాటలు వినపడనట్లే వీధి గుమ్మంవైపు చూస్తూ నిలుచున్న ఆదిత్య, చెప్పుల చప్పుడు విని వెనక్కు తిరిగాడు.

అతనంతవరకూ చేసిన వూహాలకి విరుద్ధంగా, అత్యంత సాధారణంగా అలంకరించుకు వచ్చింది హేమంత.

లేత గులాబి వర్ణపు పువ్వుల చీరె, ఒక చేతికి రెండే రెండు గాజులూ, మరో చేతికి రిస్ట్‌వాచీ, మెడలో సన్నని గొలుసూ, చిన్న బొట్టూ.

ఎంత సాదాగా వున్నా ఆకర్షణ మాత్రం అధికంగానే కనిపించిందా ముఖంలో అతనికి.

ఆ ఆకర్షణకి లోబడకూడదన్నట్లుగా, లోబడి పోతానేమోనని భయపడుతున్నట్లుగా గిరుక్కున తల త్రిప్పుకు ముందుకు నడిచాడు. వెనకే అడుగులు వేసింది అమ్మమ్మ తృప్తికోసమన్నట్లుగా హేమంత.

**ప్రారంభం !**

కారు, కారిడార్లోకి డ్రైవ్ చేసుకువచ్చాడు ఆదిత్య. ముందు తలుపు తెరిచి అతడి ప్రక్కగా కూర్చుంది హేమంత. రివ్వున దూసుకుపోయిన కారుని చూస్తూ అక్కడే నిలబడ్డ ధనలక్ష్మి, కళ్లు తుడుచుకు వెనక్కు తిరిగింది.

* * *

"ఏ థియేటర్‌కు పోనివ్వమంటావ్ ?"

మిర్రర్లోంచి రియర్‌వ్యూ దీర్ఘంగా గమనిస్తూ, కారు నడపటమే తన జీవిత ధ్యేయమన్నట్లు ప్రవర్తిస్తున్న ఆదిత్య, సెంటర్లోకి రాగానే అడిగాడు.

"నీ యిష్టం." క్లుప్తంగా అంది హేమంత.

"అదేం గడుసుదనం మళ్లా ? నీ కోరికమీద నేను బయల్దేరానుగానీ, నా కోరికమీద కాదన్న విషయం గుర్తుంచుకోవటం మంచిది."

"నా కోరికమీదా బయల్దేరలేదు. అమ్మమ్మ కోపానికి జడిసి బయల్దేరావన్న విషయం జ్ఞప్తికి తెచ్చుకోవటమూ మంచిది."

మరి మాట్లాడకుండా కారుని తిన్నగా లజ్ కార్నర్‌గుండా, రోసరీ చర్చ్‌రోడ్‌లోకి పోనిచ్చాడు ఆదిత్య.

అభ్యంతర పెట్టకుండా కారు దిగి, అతడి వెనకే బీచ్‌లోకి నడిచింది హేమంత.

ఎక్కువమంది జనం లేరు. సముద్రపుటొడ్డున వున్న రోడ్డుకూడా దాటి, ఇసకలో కూలబడ్డారు. పాప్‌కార్న్ కొని, ఒక పాకెట్ ఆమెకి అందించేడు ఆదిత్య. పొట్లం విప్పి ఒకొక్కటే నోట్లో వేసుకోసాగింది హేమంత.

దాదాపు పావుగంట గడిచిపోయింది. జేబులోంచి తీసుకుని సిగరెట్ వెలిగించుకున్నాడు ఆదిత్య. గంభీరంగా సముద్రంకేసే చూస్తూ కూర్చున్నాడు.

గాలి కెగురుతున్న ముంగురులు ఫాలభాగాన చిందరవందరగా పడి, అల్లరి చేస్తున్నాయి. స్వచ్ఛత నిండిన ముఖం గాంభీర్యపు తెర పడి మ్లానంగా కన్పిస్తోంది. ఆలోచనలతో నిండి, అలిసిపోయినట్లుగా కనిపిస్తున్నాయి కళ్లు.

అతడివేపే పరిశీలనగా చూస్తున్న హేమంత దీర్ఘంగా నిట్టూర్చింది !

'ఏమిటతడి ముభావం ? ఎందుకో మానసికంగా కృంగిపోతున్నాడన్నమాట వాస్తవం ! ఏమిటా వేదనకి మూలం ? అమ్మమ్మ క్షోభకు అంతులేకుండా వుంది. ఎంత ప్రయత్నించీ, ఏ కారణమూ రాబట్టుకోలేకపోయిందామె ! పన్నెత్తి పలకనైనా పలకడుట — ఆ మాట ఎత్తితేచాలు, అక్కణ్ణుంచి లేచిపోతున్నాడుట !

అందమైన ఆ ముఖం వింత గాంభీర్యంతో ఎంత అందంగా వుంది ! కానీ ప్రశాంతి కోసం వెదుక్కుంటూ, ఏదో అశాంతితో చలిస్తున్న ఆ కళ్లు ఎంత దీనంగా వున్నాయి !

తనా వేదనకి కారణాన్ని తెలుసుకోగలిగితే ? అతడు కోరుకొంటున్న శాంతిని అందించగలిగితే ? ఆ ముంగురుల్ని తన వేళ్లతో సవరించి, ఆ ముఖాన్ని తన గుండెలకి హత్తుకుని, అతడి మనసుని తన ఓదార్పుతో ఉల్లాసపరచగలిగితే !

కానీ, ఎలా ?

అసలెందుకిలా మారిపోయాడు ?

చిన్నప్పుడంతా ఎంత చిలిపిగా, అల్లరిగా వుండే వాడు! నోరు తెరిస్తే, ఆ వాగ్ధోరణికి అంతుం డేదా!

మరిప్పుడు? మూగినాడిలా అలా ఎలా కూర్చొ గాలుగుతున్నాడు ఎదురుగా తన నుంచికొని కూడా?

సినిమాకని బయల్దేరి, యిలా బీచికెందుకు తీసుకొచ్చాడు? అదైనా ఏ మెరీనాకో కాక, జనసమ్మర్దమే లేని యీ బీచ్‌కా! ఏమిటింత నిర్వేదానిక్కారణం?'

ఆమె ఆలోచనల్లోనే మరో అరగంట గడిచి పోయింది క్రమంగా కృంగిపోయాడు భానుడు

"మామయ్యా!" మెల్లగా పిలిచింది హేమంత.

"ఊఁ" ఉలిక్కిపడి ప్రపంచంలోకి వచ్చాడు ఆదిత్య

"ఏమిటి మామయ్యా, నీలో నువ్వే ఆలో చించుంకుటున్నావ్?" సౌమ్యంగా అడిగింది

"ఏం లేదు హేమా!" పరధ్యానంగానే జవా బిచ్చాడు ఆదిత్య.

"ఊహూఁ ఏం లేకపోతే ఎందుకంత పరధ్యా నంగా వున్నావ్? ఎందుకు నీలో నువ్వే మథనపడు తున్నావ్? నీలో ఏదో బాధ రగులుతోంది అది మరొకరితో పంచుకుంటేనే తీరుతుంది

చెప్పు మామయ్యా, నాతో నీ బాధ చెప్పకో కూడదా? ఆ బాధ పోగొట్టే ప్రయత్నమైనా చేయతగనా నేను?" ఆత్రుతగా అంది హేమంత

"లాభంలేదు హేమా! యిది మరొకరితో పంచుకోగల వ్యధ కాదు దీనికి సానుభూతి వాక్యా లతో అంతం రాదు అందుకే ఎవరికీ చెప్ప కోవాల్సిన అవసరమూ లేదు



పోదాం పద!"

మరో మాటక్కూడా తావీయకుండా చటుక్కున లేచి, నిలబడ్డాడు ఆదిత్య.

మరో రెండు నిముషాల్లో కారు వెనక్కు బయల్దేరింది.

*　　*　　*

"అదేమిట్రా! అప్పుడే వచ్చేశారేం? సినిమాకి వెళ్ళలేదా ?"

ఎనిమిదైనా కాకముందే తిరిగివచ్చిన కొడుకునీ, మనవరాల్నీ చూస్తూ, విస్తుపోయింది ధనలక్ష్మి.

"ఆకలిగా వుంది. అన్నం వడ్డించమ్మా!" ఆమె ప్రశ్నకు జవాబీయకుండా అనేసి, పైకి నడిచాడు ఆదిత్య. అప్పటికే గదిలోకి వెళ్ళిపోయింది హేమంత.

ఇద్దర్నీ చూసి దీర్ఘంగా నిట్టూర్చింది ధనలక్ష్మి.

'భగవంతుడా! నా కింకా మంచి రోజులు ఎప్పటికి రాశావురా!' అనుకుంటూ.

## 2

పదకొండు గంటలు కొట్టింది గోడనున్న గడియారం.

విసుగ్గా దుప్పటిని తన్నేసి, లేచి కూర్చున్నాడు ఆదిత్య. గంటకు పైగా ప్రయత్నిస్తున్నా, అటూ యిటూ వత్తిగిలటం మిగిలిందే తప్ప, నిద్ర పట్టలేదు. శాంతి లేని మనసు — నిదురరాని కళ్ళు — లేచి, వరండాలోకి నడిచాడు. బాల్కనీలో నిలబడి తోటంతా కలయజూశాడు.

అంబరం నుండి చలువలు కురిపిస్తున్నాడు జాబిల్లి. అర్ధ రాత్రివేళ, తననెవరూ చూడటం లేదన్న ఆదమరపుతో, నగ్నంగా వెన్నెల స్నానం చేస్తోంది ప్రకృతి కాంత. ఆమె వంటిమీది సబ్బు మరగలా తెల్లగా విచ్చుకుంటున్న పూలు, ఆ వంటిమీద మెరుస్తున్న నీటి బిందువుల్లాటి మంచు బిందువులూ తోటకు వింత అందాన్నిస్తున్నాయి. ఉండుండి వీస్తున్న పిల్లతెమ్మెరల్లో కలుస్తున్న నైట్ క్వీన్ సువాసన మత్తు గొలుపుతోంది.

తలుపులు దగ్గరగా లాగి, చప్పుడు కాకుండా మెట్లు దిగాడు ఆదిత్య. మెట్ల పక్కగా వున్న హేమంత గది కిటికీ తలుపులు బార్లాగా తెరుచుకొనే వున్నాయి. బయటకు నడవబోయి, అప్రయత్నంగా ఆమె గదిలోకి చూశాడు.

తోటవైపు కిటికీలోంచి చారలు, చారలుగా హేమంత ముఖంమీదకు పడుతోంది వెన్నెల. ఆ పాల వెలుగులో నిర్మలంగా మెరుస్తోంది ఆమె ముఖం. కల్మషరహితమైన చిరునవ్వు గులాబిరేకుల్లాటి పెదాలమీద పరుచుకు నర్తిస్తోంది.

ఒక్క నిముషంపాటు ఆ ముఖంలోకే చూస్తూ వుండిపోయి, ఆ వెనుక దీర్ఘంగా నిశ్వసిస్తూ కదిలాడు ఆదిత్య. చప్పుడు కాకుండా తలుపులు తెరిచి, తను బయటికి నడిచి తలుపులు దగ్గరకు లాగాడు. వరండా మెట్లు దిగి, తోటలోకి నడిచాడు.

పావుగంటసేపు తోటంతా పచార్లు చేస్తూ, మూగగా పొద పొదనీ, తీవె తీవెనీ పలకరిస్తూ, మనసుని స్థిరపర్చుకున్నాక నెమ్మదిగా మధ్యకు నడిచి, ఓ సిమెంటు సోఫాలో కూలబడి వెనక్కు జేరగిలబడ్డాడు. చల్లదనానికి వొళ్ళు ఝల్లుమని, జివ్వున లాగింది. లేవబుద్ధిమాత్రం కాలేదు. అలాగే కూర్చుండిపోయాడు.

తిరిగినంతసేపూ చెదిరిపోయినట్లే చెదిరిపోయిన ఆలోచనలు, స్థిమితంగా కూర్చోగానే తిరిగి చుట్టుముట్టాయి :

'పాపం! ఎంత తపనపడుతోంది హేమ! ఎలాగైనా తనని సుముఖుణ్ణి చేసుకోవాలనీ, తనవాణ్ణి చేసుకోవాలనీ ఎంత ఆరాటం! పిచ్చిపిల్ల! శవకల్యాణంలో ఏం సంబరాన్నూహించుకుంటోందో! అవును ... జీవచ్ఛవంలాటి తనతో కల్యాణం ఏ యువతికైనా అంతకంటె ఎక్కువేమౌతుంది ?

చిన్నప్పుడు చింతపిక్కలవంటి ఆటల దగ్గర నుంచీ, తొక్కుడుబిళ్ళలాటి ఆటలదాకా యిద్దరూ కలిసి ఆడుకున్నారు. దొడ్లోని జామిపిండెలు పెద్దవాళ్ళకి తెలియకుండా కొయ్యటం దగ్గర్నుంచీ, వూరి బయట మామిడితోటలో కాయలు దొంగిలించటందాకా యిద్దరూ కలిసే చేసేవాళ్ళు! తల్లిలేని పిల్ల కావటాన, అమ్మకి మనవరాలిమీద చాలా ఆపేక్ష వుండేది. హైస్కూలు చదువు పూర్తయ్యేదాకా యిద్దరూ ఒకే స్కూల్లో చదివారు.

కాలేజీకి రావటంతోనే ఆమె తండ్రి దగ్గరకు వెళ్ళిపోవటమూ, తను పొరుగూరికి రావటమూ జరిగాయి. క్రమంగా తన పరిధి పెరిగిపోయి, ఆమె సాన్నిహిత్యం మరుగున పడిపోయింది, మానసికంగా కూడా.

తిరిగి ... యిన్నేళ్ళకి ... తన మనసున్న యీ పరిస్థితిలో ... మొన్న అమ్మతో కలిసి వచ్చింది తమ యింటికి !!

పిచ్చి అమ్మ ... హేమంతని చూడగానే తను మారిపోతాడనీ, వివాహానికి సుముఖుడై పోతాడనీ తలచి వుంటుంది !

వివాహమంటే తనకు విముఖతలేని పక్షంలో, హేమంతతో వివాహానికి సుముఖతే చూపించివుండేవాడేమో !

కానీ ... యిప్పుడు శమంతను మరచిపోవటం తన తరమా ? ఈ జన్మకు సాధ్యమా ?

ఎంతమాత్రం కాదు.

అసలు శమంతతో పరిచయమే జరగని పక్షంలో, హేమంతమీద తనకూ మనసు మళ్ళేదేమో !

కానీ ... యిప్పుడు తన మనసూ ... ఎవరిమీదకైనా మళ్ళగలదా ?

అసాధ్యం !

శమంత ... వసంతంలా తన బ్రతుకులో ప్రవేశించి, ప్రేమించటం నేర్పి...శిశిరాన్ని మిగులుస్తూ వెళ్ళిపోయింది ! వాడిపోయిన యీ జీవితాన పునర్వసంతోదయం ఏ హేమంతద్వారా నైతే మాత్రం ఎలా సాధ్యం ?' బాధగా కళ్ళు మూసుకున్నాడు ఆదిత్య. క్రమంగా మగతలోకీ, ఆవెనక నిద్రలోకీ జారాడు.

కౌలాలంపూర్‌లో విశ్వ విజేతలై వచ్చిన మన హాకీ జట్టుకు ఢిల్లీలో ఘనమైన స్వాగతం లభించింది. కుడివైపున జట్టు నాయకుడు శ్రీ అజిత్‌పాల్ వున్నారు.



# హేమంత — శమంత

## 3

అసలు శమంతతో పరిచయమే విచిత్రమైన పరిస్థితుల్లో జరిగింది ఆదిత్యకు.

ఆరోజు రాత్రి పదకొండు గంటలు దాటుతున్న వేళ. పగలల్లా హాస్పిటల్లో చాలా ప్రమాదకరమైన కేసు చూసి అలిసిపోయి వచ్చి, ఆదమరచి నిద్రపోతున్న ఆదిత్య, గది తలుపులమీద దబదబ చప్పుడు కావటంతో ఉలిక్కిపడి లేచాడు. ఆగకుండా శబ్దమౌతోంది.

విసుగ్గా లేచి తలుపులు తెరిచిన ఆదిత్య, ఎదురుగా నిల్చివున్న అమ్మాయిని చూసి ఆశ్చర్యపోయాడు. అతణ్ణే చూస్తూనే, అప్పటివరకూ తలుపులు దబదబా బాదిన ఆమె ఉలికిపాటుగా రెండడుగులు వెనక్కి వేసింది.

'ఆదిత్య' అన్న పేరు విని, డాక్టరును ఏ నలభై, యాభయ్యేళ్ళ వాడిగానో వూహించుకున్న ఆమె, ఎదురుగా నిలబడ్డ పాతికేళ్ల స్ఫురద్రూపిని చూసి ఆశ్చర్యంతో స్థాణువైపోయింది.

"ఏం కావాలండీ ?" ఆశ్చర్యాన్ని తమాయించుకొంటూ, అడిగాడు ఆదిత్య.

"మీరు ... డాక్టర్‌గారు మీరేనా ?" చటుక్కున స్పృహలోకొచ్చి, అడిగిందామె.

"అవును. ఎవరికయినా ప్రమాదమా ?"

అర్ధరాత్రివేళ, ఆపదలో వున్నట్లు కనబడ్డ ఆడపిల్లను చూడగానే నిద్రమత్తూ, బద్ధకమూ ఎగిరిపోయాయి ఆదిత్యలో.

"మా నాన్న ... మా నాన్నగారికి సీరియస్‌గా వుంది. మాకు చాలా కంగారుగా వుందండీ ! మీరొక్కసారి దయచేసి..."

ఆమె మాటలు పూర్తికాకమునుపే, పైజమా మీదే ప్యాంటు వేసుకుని, షర్ట్ గుండీలు పెట్టుకుంటూ అడిగాడు ఆదిత్య,

"ఎంత దూరం మీ యిల్లు ?"

"రోడ్డవతలున్న ఆ పెంకుటిల్లేనండీ పూది."

"ఓసీ ! అదేనా, అయితే పదండి."

బ్యాగ్ చేతిలోకి తీసుకు ఆమె వెంట నడిచాడు. రోడ్డు దాటుతూ అడిగాడు—

"ఏమిటి మీ నాన్నగారి కంప్లైంటు ?"

"గుండెనొప్పి. ఉన్నట్లుండి ఉధృతంగా వస్తూందండీ ! యివేళ సాయంత్రంకూడా బాగానే వున్నారు. రాత్రి తొమ్మిదిగంటల వేళ, మళ్లా నొప్పి వచ్చేలా వుందమ్మా — అన్నారు. మామూలుగా వాడుతున్న మందు వేశాను. ఛాతీకి వేడి వేడి కాపుపెడితే సర్దుకోవటం మామూలు. అదీ చేశాను. కానీ తగ్గలేదు. అరగంటనుంచీ బాధతో మెలికలు తిరిగిపోతున్నారు.

మా నాన్నగారిని ట్రీట్ చేస్తున్న డాక్టరుగారిల్లు యిక్కడికి చాలా దూరం. మీరిమధ్యే యిక్కడ చేరారని తెలిసి, వెంటనే అవసరమని పిలిచి..."

"ఫర్వాలేదు ... పదండి."

ఇద్దరూ యింట్లోకి దారితీశారు.

మంచంమీద బలరామయ్య బాధతో మెలికలు తిరిగిపోతున్నాడు. ఉండుండి, 'అమ్మా...అబ్బా' అంటూ కేకలుపెడుతున్నాడు. ఆయన్ని శమంత కదలకుండా పట్టుకోగా, ఆదిత్య పరీక్ష చేశాడు. వెంటనే ఇంజక్షన్ చేశాడు.

తాత్కాలికోపశమనానికి మాత్రలు గూడా యిచ్చాడు. అరగంట తర్వాత కాస్త స్థిమితపడ్డాడు బలరామయ్యగారు.

మరో పావుగంటసేపక్కడే కూర్చుని శమంతకూ, ఆమె తల్లి సావిత్రికీ ధైర్యం చెప్పి గదికి చేరుకున్నాడు ఆదిత్య.

*　　*　　*

"నిన్న రాత్రి మీరు చేసిన సహాయానికి మీకు చాలా ఋణపడిపోయాం మేము."

మర్నాటి ఉదయం హాస్పిటల్‌కు వెళ్లబోతూ వచ్చిన ఆదిత్యతో అంది శమంత.

"డాక్టర్‌గా అది నా విద్యుక్తధర్మం. పట్టా పుచ్చుకొనేముందు యిటువంటి పరిస్థితులన్నిటికీ సిద్ధమని ప్రమాణం చేసే పుచ్చుకుంటాం. అందువల్ల ప్రత్యేకించి థాంక్స్ చెప్పవలసిన అవసరంలేదు."

మందహాసంతో అన్నాడు ఆదిత్య.

"అనుసుకోండి...అయినా 'డాక్టర్'గా కాకపోయినా, మనిషిగానో? డాక్టర్‌గా మీకు అలసటా, అకాలమూ వుండకపోవచ్చు. కానీ, పగలల్లా శ్రమించి, శ్రమను మరిపించే విశ్రాంతి నాశించి, నిద్ర నాశ్రయించిన ఒక మామూలు మనిషిగా మీరు విసుక్కుంటే అది అసందర్భమూ, అన్యాయమూ కాజాలవుగా !

చేతనావస్థలోనూ, అచేతనావస్థలోనూ కూడా కర్తవ్య విస్మరణ చేయనివారికి కృతజ్ఞత తెలియజెయ్యటమూ, అభినందించటమూ అనౌచిత్యం కాదనుకుంటాను."

చిరునవ్వుతోనే జవాబిచ్చింది శమంత.

రాత్రి — తెల్లవారనిస్తుందా లేదా అన్నంతగా కంగారుపెట్టిన తండ్రి ఉదయానికల్లా హాయిగా లేవగలగటం, ఆమెను అనూహ్యానుభూతులతో కూడిన ఆనందానికి గురిచేసింది. ఆ ఆనందంతోనే తన సహజ లజ్జాభిమానాల్ని కూడా మరిచి మనసువిప్పి మాట్లాడగలిగింది — ఆ ఆనందానికి కారకుడైన ఆదిత్యతో.

అంతలోనే సావిత్రి చూపులు చురుక్కున తగలటంతో, తలదించుకుని,




"రాత్రి మీరిచ్చిన మందులేవో యీ నోట్ బుక్‌లో వ్రాసియివ్వగలరా ? మా డాక్టర్‌గారికి చూపించాల్సి వుంటుంది. ఏ పరిస్థితుల్లో, ఎలాటి మందులు వాడిందీ ఆయనకు తెలియజేస్తే, ఆయనకి ట్రీట్‌మెంట్ సులభంగా వుంటుందని యీ ఏర్పాటు చేసుకున్నాం." అంది, ఓ నోట్ బుక్ అందిస్తూ.

"అలాగే" అంటూ ఆ బుక్ అందుకుని,

"అయినా మీ డాక్టరుగారి చిరునామా ఇవ్వరాదూ ? నేనే ఫోన్లో కాంటాక్ట్ చేస్తాను. ఇలాటి వ్యాధిని ముదరనివ్వటం అంత మంచిదికాదు. ఏ క్షణాన తిరగబెడుతుందో తెలియదుకదా ! అంత దూరాన వున్న డాక్టర్ ట్రీట్ చేసేకంటే, దగ్గర్లోనే ఎవరికన్నా కేసు అప్పగించటమూ మంచిది. అందుకే నేను మాట్లాడతాను కేసు హిస్టరీ అంతా !"

సహజంగా తనకు రోగులమీద వుండే శ్రద్ధ కొద్దీ అన్నాడు ఆదిత్య.

"అంతకన్నా కావల్సిందేముంది ? ఇదిగో యిదే ఆయన ఎడ్రస్. మీ సహాయాని కెంతైనా కృతజ్ఞులం."

డ్రాయర్లోంచి ఓ విజిటింగ్‌కార్డ్ తీసి అందిస్తూ అంది శమంత.

బలరామయ్య నొకసారి పరీక్షించి, ఆయన వాడుతున్న మందుల్ని చూసి, తోచిన సలహానిచ్చి, తిరిగి సాయంత్రం వస్తానని చెప్పి శలవు తీసుకున్నాడు ఆదిత్య.

"చాలా మంచివాడిలా వున్నాడమ్మా, కుర్ర డాక్టరు !"

అతడు వెళ్లినవైపుగా చూస్తూ అన్నాడు బలరామయ్య.

పెదవులు విరుస్తూ విసురుగా లోపలికి వెళ్లిపోయింది ఆ మాటలు విన్న సావిత్రి.

నిర్లిప్తంగా నిట్టూరుస్తూ అనుసరించింది శమంత.

## 4

ఆ సాయంత్రమే కేసుని హస్తగతం చేసుకున్నాడు ఆదిత్య. 'పైస రాలని ఆ మొగమాటపు కేసు' వొదిలిపోవటమే అదృష్టమన్నట్టుగా—సందు దొరకటంతోనే తప్పుకున్నాడు ఆ డాక్టర్.

అంతకు రెండు మూడు నెలల ముందునుంచే, ఆ డాక్టర్ వైఖరి మారటమూ, అతడు తమ యింటికి రావటానికీ, తండ్రిని పరీక్షించటానికీ నిర్లక్ష్యం చూపుతుండటమూ గ్రహించినా, శమంత అంతకన్న ఎక్కువ డబ్బుతో మరో డాక్టర్ని తెచ్చుకోలేకా, అతడు చిరకాలంగా పరిచయమున్నవాడు గనుకా అలాగే యీడుస్తోంది ఆ ట్రీట్‌మెంట్‌ని — మనసులో బాధపడుతూనే !

దేవుడు పంపిన మనిషిలా వచ్చిన ఆదిత్య, కేసుని తనకు తానై తీసుకోవటమూ, శ్రద్ధగా ప్రతిరోజూ వచ్చివెళ్తూ, తనకేవైనా శాంపుల్స్ లభ్యమైనప్పుడల్లా మందులుకూడా సహాయపడుతుండటమూ ఆమెకు క్రొత్త ఆశనీ, ఆనందాన్నీ కలిగింపజేశాయి.

మనసులోనే దేవుడికి శతవిధాలా మొక్కుకుంది, 'యికనైనా తండ్రి ఆరోగ్యం ఓ దారికి చేరేలా చేయి భగవంతుడా !' అని. (ఇంకా వుంది)

నిన్నటి పాపాయి నిన్నటి పౌడరు

# ఇదిగో ఈనాటి పాపాయి కోసం

# కొత్త టెండర్ కేర్ –

మృదువైన చర్మానికి సరిపడేట్లు బఫ్ఫర్ చేయబడింది.




నిన్నటి బఫ్ఫర్ చెయ్యబడనటువంటి పౌడర్లు మీ పాపాయి యొక్క మృదువైన చర్మాన్ని చిరచిరలాడించవచ్చు. కొత్త టెండర్ కేర్ మీ పాపాయి చర్మాన్ని చిన్న చిన్న దురదలనుండి, చిరపరలనుండి రక్షించుటకై సరిగ్గా బఫ్ఫర్ చెయ్యబడినది. టెండర్ కేర్ యొక్క అధిక తేమను పీల్చుకొనే గుణము ఏడ్చే మీ పాపాయిని ఇట్టే నవ్వించగలదు. అతి మెత్తని పట్టువంటి మృదుత్వము నుండి పాపాయికి రుచించే సువాసన వరకు, టెండర్ కేర్‌లోని అన్ని అంశములు, అతి జాగ్రత్తగా ఎన్నిక చేయబడినవి. అందుకే దీని పేరు టెండర్ కేర్.

టెండర్ కేర్ అంటే "మృదువైన రక్ష." మీ పాపాయి కోసం వాడండి నేడే.




# రూ.1 తగ్గింపు!

## ఈ ప్రచురణను చదివే పాఠకులకోసం ప్రత్యేక సదుపాయం

ఈ కూపన్ కత్తిరించి మీ పేరు, చిరునామా ఇంగ్లీషులో వ్రాసి కూపన్‌లో ఉన్న చిరునామాకు పంపండి. అందుకు బదులుగా మీకు ఓ ప్రత్యేకమైన డిస్కౌంట్ కూపన్ లభిస్తుంది. ఆ కూపన్ ద్వారా మీరు కాల్గేట్ టెండర్ కేర్ బేబీ పౌడర్ యొక్క జెయింట్ సైజ్ ప్యాకు ధరలో రూ. 1/- డిస్కౌంట్ లభింపజేసుకోవచ్చు.

COUPON

To: ASVP

Colgate Tender Care Baby Powder D.O.
C/o Colgate-Palmolive (India) Pvt. Ltd.
12-A Ritchie Street, Madras 600 002

Dear Sirs:
I would like to have my Colgate Tender Care Discount Voucher sent to:

Name ____________________

Address ____________________

____________________

CTC 6.4 TL

మీరు 'గళ్ళు' ఎన్నయినా సరే సులువుగా ఎన్ని రకాలుగా వీలైతే అన్ని రకాలుగా వేయటంలో కొన్ని కిటుకులున్నాయి.

గళ్లో పడికట్టు : ఎటు కూడినా అదే మొత్తం

# అంకెల తమాషా!

[సి వి. సూర్యనారాయణమూర్తి]

అంకెలతో మనం అనేక తమాషా సమస్యలు సృష్టించవచ్చు. వాటిని పరిష్కరించడం ఆ రకమైన అభిరుచిగల వారికి, ముఖ్యంగా విద్యార్థులకు ఆసక్తిదాయకంగా వుంటుంది. ఒక చదరంలోని గళ్ళల్లో, ఒకే వరుసలోని అంకెలతో నిలువుగా, అడ్డంగా, ఐమూలగా, ఎటు కూడినా ఒకే మొత్తం వచ్చేలాగ పూర్తిచేయడం అటువంటి వాటిలో ఒకటి. అటువంటి ప్రయత్నంలోనే వాటిని పూర్తిచేయడానికి కొన్ని సులభ మార్గాలు కనుగొనడం జరిగింది. ఈ క్రింద వివరించిన పద్ధతులతో ఏ అంకెలనైనా (ఒకే వరుసలోనివి) ఆ రకంగా వుపయోగించవచ్చును. అటువంటి ప్రయత్నం మీరెప్పుడైనా జేసివుంటే ఈ పద్ధతిలో ఏదైనా సులువుందేమో చూడండి.

## సమస్య ఏమిటి?

మామూలుగా ఈ రకం సమస్యలు యెలా వుంటాయో రెండు ఉదాహరణల రూపంలో ఇచ్చి, వాటిని పూరించే పద్ధతులు వివరిస్తాను.

ఉదాహరణ : 1 నుండి 9 వరకు గల అంకెలతో, ఒక అంకెను ఒకేసారి ఉపయోగించి, ఎటు కూడినా (నిలువుగా, అడ్డంగా, ఐమూలగా) మొత్తం 15 వచ్చేటట్లు ప్రక్క గళ్లలో పూర్తిజేయండి. (తొమ్మిది గళ్ళు) లేక 1 నుండి 16 వరకు గల అంకెలతో, ఒకసారి ఉపయోగించిన అంకె మరల ఉపయోగించకుండా, అడ్డంగా, నిలువుగా, ఐమూలగా, ఎటు కూడినా మొత్తం 34 వచ్చేటట్లు ప్రక్క గళ్లలో పూర్తి చేయండి (పదహారు గళ్ళు.)

(ఎటు కూడినా రావలసిన మొత్తం ఆ గళ్లలో ఉపయోగించే అంకెలనుబట్టి మారుతుంది.)

పూర్తిచేయడం ఎలా? : పై రెండు ఉదాహరణలలోని అంకెలతో గళ్లను పూర్తిచేసే విధానాలను వివరిస్తాను.

### 1) మూడు వరుసల అంకెలు :

ఇచ్చిన అంకెలను మామూలు వరుసక్రమంలో వ్రాసి చూడండి. అయి మూలగాను, అడ్డం, నిలువు మధ్య వరుసలు, కూడితే మనకు కావలసిన మొత్తం 15 వస్తుంది. పోతే చివరి వరుసలు మాత్రం సరిపోవు.

| | | |
|---|---|---|
| 1 | 2 | 3 |
| 4 | 5 | 6 |
| 7 | 8 | 9 |

ఆ అంకెలలో మధ్యదైన 5 ను మాత్రం దాని స్థానంలో ఉంచండి. ఎటు కూడినా రావలసిన మొత్తం 15 లో 5 తీస్తే మిగిలినది 10. ఆ మొత్తం వచ్చేటట్లుగా మిగిలిన అంకెలను నాలుగు జతలుగా వ్రాయవచ్చు (ప్రక్క చూపినట్లు) వీనిలో 2 జతలు సరిసంఖ్యలవి, మరి రెండు జతలు బేసి సంఖ్యలవి.

5

( 1, 9 )

( 2, 8 )

( 3, 7 )

( 4, 6 )

యిప్పుడు ఈ క్రింది సూత్రం ప్రకారం అంకెలను గళ్లల్లో వ్రాయండి.

1) మధ్య అంకె 'బేసి' సంఖ్య అయితే సరి సంఖ్యల జతలు అయి మూలల వరుసలలో వ్రాయండి.

| | | |
|---|---|---|
| 2 | | 6 |
| | 5 | |
| 4 | | 8 |

లేదా

మధ్య అంకె 'సరి' సంఖ్య అయితే బేసి సంఖ్యల జతలు అయి మూలల వరుసలలో వ్రాయండి. యిప్పుడు ప్రక్క చూపిన విధంగా గళ్ళు ఉంటాయి. (ఏ అంకె ఎటు వాడాలన్న నిబంధన లేదు.)

మిగిలిన నాలుగు ఖాళీలలోను సరిగా ఆ వరుస మొత్తం 15 వచ్చేందుకు ఏ అంకె కావాలో అవి వేయండి. ఇప్పుడు చూడండి — మనకు కావలసిన పద్ధతిలో గళ్ళు నింపబడతాయి.

| | | |
|---|---|---|
| 2 | 7 | 6 |
| 9 | 5 | 1 |
| 4 | 3 | 8 |

### నాలుగు వరుసల అంకెలు :

నిజానికి యివి పూర్తిచేయడం మొదటివాటికంటె తేలిక. పైన యిచ్చిన ఉదాహరణ సమస్య ప్రకారం 1 నుండి 16 వరకు గల అంకెలతో ఎటు కూడినా 34 రావాలిగదా! ముందు అన్ని అంకెలనూ వరుస క్రమంలో ప్రక్క చూపిన విధంగా వ్రాయండి. ఉన్నవి వున్నట్లుగా అయిమూల వరుసలలో అంకెలు కూడితే మనకు కావలసిన మొత్తం (34) వస్తుంది. ఆ వరుసలను ఏమీ మార్చకండి. అవికాక మిగిలిన అంకెలను క్రిందివాటిని పైకీ పై వాటిని క్రిందకూ ఒక వైపువి మరొక వైపుకు మార్చండి. (అంటే 14 ను పై వరుసలో 3 వ అంకెగాను 15 ను రెండవ అంకెగాను మార్చండి.) అదేవిధంగా ఎడమవైపు నిలువు వరుసలో మిగిలిపోయిన 5, 9 అంకెలను కుడివైపు నిలువు వరసలో 9, 5 లుగా వ్రాయండి.

| | | | |
|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 |
| 5 | 6 | 7 | 8 |
| 9 | 10 | 11 | 12 |
| 13 | 14 | 15 | 16 |

| | | | |
|---|---|---|---|
| | 15 | 14 | |
| 12 | | | 9 |
| 8 | | | 5 |
| | 3 | 2 | |

ఇప్పుడు మొత్తం అంకెలు యిలా వుంటాయి. ఎటు కూడినా యిప్పుడు మనకు కావలసిన మొత్తం వస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 1 | 15 | 14 | 4 |
| 12 | 6 | 7 | 9 |
| 8 | 10 | 11 | 5 |
| 13 | 3 | 2 | 16 |

### వీటిని ఎన్నిరకాలుగా ఏర్పాటు చేయవచ్చు?

యీ రకంగా పూర్తిచేసిన గళ్లను ఎట్లు కూడినా అదే మొత్తం వచ్చేటట్లుగా 8 రకాలుగా ఏర్పాటు చేయవచ్చు. చేసే మార్పుఅంతా అడ్డ వరుసలను నిలువుగాను, నిలువువరుసలను అడ్డంగాను మార్చడమే.

పై లెక్కకు ఆ ఎనిమిది రకాల ఏర్పాట్లూ 40వ పేజీలో యివ్వబడ్డాయి.

[గమనిక : నాలుగు వరుసల అంకెల విషయంలో పైన వివరించినది ఒక పద్ధతి మాత్రమే. యింకా అనేక రకాలుగా అంకెలను మార్చి అదే ఫలితం సాధించవచ్చు. ఒక పద్ధతిలో అమర్చిన తరువాత దానిని పైన చెప్పిన ఎనిమిది రకాలుగా మార్చి వ్రాయవచ్చు.]

అందుకని ఆ పేపరు వాళ్లిద్దరి పేర్లతో కాన్ఫరెంచుకు వెళ్లింది. బెనర్జి ఆ విషయం వి. వి. రావ్ దగ్గర్దాచాడు. కాన్ఫరెంచుకు మూఢేశ్వర్ బయల్దేరిన రోజునే బెనర్జిపాపం బద్దలయింది. మూఢేశ్వర్ కాన్ఫరెంచుకెళ్లే పేర్లలో తన్దొక్కడిదే రాసుకుని బెనర్జీ దొదిలేసాడు. బెనర్జి కావిషయం తెలియగానే "ఓర్నక్కా!" అనుకున్నాడు.

"ఇదిగో వి. వి. రావూ! నేన్నీ పేరెట్టి పేపరు మూఢేశ్వర్ చేతికిచ్చానా, అతనేమో పేపరు మీద తన పేరెట్టుకుని, నీ పేరు తీసేసాడు.

## కాన్ఫరెన్సుల తిరునాళ్ళు

(18వ పేజీ తరువాయి)

ఇవాళే నాకా విషయం తెలిసింది. పైగా తనొక్కడే ఢిల్లీ వెళ్తున్నాడు" అంటూ వి. వి. రావుని వుసిగొల్పాడు.

"నువ్వేసిన పనే ఆయనా చేసాడు" అన్నాడు వి. వి. రావ్.

ఇతన్తో లాభంలేదని గమనించి బెనర్జి "నేనూ వస్తాను" అంటూ మూఢేశ్వర్ వెంటపడ్డాడు. అది నువ్వే జూసావ్.

నువ్వు చూడనిది పి. వి. రావ్, వి. వి. రావ్ స్టేషన్ బయట నిలబడి నినాదాల్జేయటం.

...అంటూ సిద్దయ్య కథ ముగించాడు. మణి నిద్దరాపి లేచింది. రైలు పక్క స్టేషన్లో ఆగింది. కాఫీలొచ్చాయి.

### స్వాగత సత్కారాలు

మధ్యాహ్నానికే జేరాల్సిన రైలు, మధ్యదారిలో లోకోమెన్, గార్డులు, స్టేషన్ మాస్టర్లు మెరుపు సమ్మెలు చేయటంవల్ల, సాయంత్రానికి ఢిల్లీ జేరింది. గోపాలావు, మణి, సిద్దయ్య రైల్దిగి సామాన్లు దింపించారు. రామరాజు గాలం, రాణి గాలం, రాజకుమార్తె గాలం వాళ్లకోసం వచ్చిన

చుట్టాలి వెళ్లిపోయారు. ముఢేశ్వర్ కోసం, వాళ్ల నాన్న పోలీసుల్నిచ్చి ఇంపోర్టెడ్ కారు పంపించాడు. అందుకని వాళ్లు వెళ్లిపోయారు. గోపాల్రావు, మణి, సిద్దయ్య మిగిలిపోయారు.

తలకి టర్బను, చొక్కాకి బాడ్జి, మొహానికి గడ్డం పెట్టుకున్న అతను వచ్చి ''హవ్ యూ కమ్ ఫర్ ది కనఫర్‌నస్'' అని అడిగాడు. గోపాల్రావు అవునన్నాడు. ''అయితే మీగురించి మా బస్సులు బయట వేచున్నాయి. అవి మీరు పోవాల్సిన చోటుకు తీసుకుపోతాయి.'' అని చెప్పాడు.

గోపాల్రావు వాళ్లు సామాన్లతో అక్కడకు చేరుకున్నారు. అక్కడ నిలబడ్డ బాడ్జీవాళ్లు ''ఎక్కడికి వెళ్లాలి మీరు'' అని అడిగారు.

''మాకెక్కడ ఎకామొడేషన్ యిచ్చారో తెలియదు'' అన్నాడు గోపాల్రావ్.

వాళ్లు దూరంగా కూర్చున్న ఎత్తుముడి పంజాబి డ్రెస్సమ్మాయిని చూపించి ''అక్కడికి వెళ్లి అడగండి'' అన్నారు. సిద్దయ్య హుటాహుటి అక్కడకు చేరుకుని ఏమడగాలో తెలియక వెనక్కు వచ్చాడు. అప్పుడు గోపాల్రావు వెళ్లాడా అమ్మాయి దగ్గరకి. ఆ అమ్మాయి ముందర ''ఆర్'' అక్షరంలో వెదికి లేదని తెల్సుకుని ''జి'' లో వెతికింది. వెతికి పట్టుకుంది. గోపాల్రావు వాళ్లకి అడవిలో కట్టిన కొత్త హాస్టల్లో చోటిచ్చారు.

గోపాల్రావు ఓ బస్సుదగ్గర కెళ్లి ''కొత్త హాస్టలుకి వెళ్తుందా ?'' అని అడిగాడు. అక్కడ బాడ్జీ పెట్టుకున్న అబ్బాయి—

''వెళ్లదు'' అన్నాడు.

''ఏది వెళ్తుంది ?''

''క్షమించాలి. తెలియదు.''

''ఎవరికి తెలుస్తుంది ?''

''అదీ తెలియదు.ఇది ఢిల్లీ. ఇక్కడ ఎవడిగోడవ వాడిదే. మరొకడి పని గురించి ఎవరికీ తెలియదు.''

గోపాల్రావు అన్ని బస్సుల్దగ్గరా అడుగుతూ పోతుంటే తొమ్మిదో బస్సువాడు ''యిది వెళ్తుంది. మీరు నేరుగా యిక్కడికి రాకుండా చాలా ఆలస్యం చేసారు.'' అన్నాడు. గోపాల్రావు జవాబు చెప్పకుండా అందులో సామాన్ని, మణిని, సిద్దయ్యని ఎక్కించాడు. మరో రైల్ని కూడా చూసుకుని బస్సు బయల్దేరింది.

బస్సు వెళ్లి వెళ్లి అడవిలాగా అందంగావున్న చోట ఆగింది. అక్కడ గోపాల్రావు, అతగాడి భార్య, మావగారు దిగబడ్డారు. బస్సు వెళ్లిపోయింది. అప్పుడో చౌకీదా రక్కడకి కర్రూపుకుంటూ వచ్చాడు. హిందీలో ప్రశ్నించి ఆ తరువాత ''అరోరాసాబ్'' అంటూ పిలిచాడు. అరోరాసాబ్ వచ్చాడు. స్వాగతం చెప్పాడు. గదులు తెరిచాడు. అందులో మంచాలమీద పరుపుల్లేవు. కొళాయిల్లో నీళ్లు లేవు. గోపాల్రావు అన్నీ పరీక్షిస్తుంటే అరోరా సాబ్ ''ఇది కొత్తగా కట్టారు. సౌకర్యాలు పూర్తిగా ఏర్పాటవలేదు'' అంటూ ఓ చిన్న నవ్వు నవ్వాడు.

''ఇది యింకా గవర్నమెంటు పుస్తకాల ప్రకారం, దీన్ని ఆఫీషియల్‌గా కమిషన్ చెయ్యలేదు'' అంటూ సమాచారం అందించాడు.

రాత్రైనా అందులో లైట్లు వెలగలేదు. క్రితం రాత్రే లైట్లు పోయాయని, అది టెంపరరీ

# కాన్ఫరెన్సుల తిరునాళ్లు

లైనవటంవల్ల ఎవరు బాగుచెయ్యాలో తెలియక ఎవరూ బాగుచెయ్యలేదని అరోరాసాబ్ చెప్పాడు. ''ఈ కొవ్వొత్తులుంచండి'' అన్నాడు ఎట్ యువర్ సర్వీస్ ధోరణిలో.

''నేనిక్కడుండను. నాకు వేరే చోటు కావాలి'' అన్నాడు గోపాల్రావ్.

''అల్లా అయితే మీరు రాక్రాసాబ్‌ని కలుసుకోవాలి.''

''ఆయనెక్కడుంటాడు ?''

''కానఫరెన్స్ జరిగేచోట, మెయిన్ ఆఫీసుంది. అక్కడ.''

''ఇప్పుడుంటాడా ?''

---

***అమ్మో ! ఉగాది రా ! రా !!***

నీ పేరే రాక్షసి గాని
నిన్నుచూస్తే జాలివేస్తున్నది...
నిన్నుమించిన రాక్షసుల
మధ్యకొచ్చి పడుతున్నావు
నిన్ను అల్లకల్లోలంచేసి
అష్టకష్టాల పాల్జేసి
చరిత్రలో రక్కసి పాదల
మధ్య పాతిపెడతారు మా వాళ్లు
నీ పేరులోనే రాక్షసంగాని
మా నైజమే రాక్షసాతి రాక్షసం.
నీ పని పడ్తాం ! రా ! రా ! (వీరాజీ)

---

''పొద్దున్న ఏడుగంటల నుంచి రాత్రి పన్నెండుదాకా వుంటారు.''

ఇంతలో మరో బస్సుడు జనం వచ్చారు. ఆ బస్సు అక్కడ్నుంచి మెయిన్ ఆఫీసుకు పోతుందని అరోరాసాబ్ చెప్పాడు. గోపాల్రావు, సామాన్లని కుటుంబాన్ని తీసుకుని ఆ బస్సెక్కాడు. తీరా ఆ బస్సు మెయిన్ ఆఫీసుకు వందగజాల దూరంలో దింపి చక్కా పోయింది. అక్కడ్నుంచి సామాను మోసుకుంటూ మెయిన్ ఆఫీసు జేరుకున్నారు. ఇంతాజేసి అక్కడ రాక్రాసాబ్ లేడు. ఆ రోజు రాత్రి ఏదో నాటకం వుందని, దాన్ని కాన్ఫరెన్స్ ఆర్గనైజర్స్ డెలిగేట్సుకోసం ఆడిస్తున్నారని, ఆ ఏర్పాట్లు చూడటానికి రాక్రాసాబ్ అక్కడకు వెళ్లాడని చెప్పారు.

''మీరు నాటకానికి వెళ్లదల్చుకుంటే పంపే ఏర్పాట్లు చేస్తాం'' అన్నారు వాళ్లు.

''మేం దూరప్రయాణం చేసొచ్చాం. రెస్టు కావాలి.''

''అయితే యీరోజు మీ హాస్టలుకి పోయి పడుకోండి. రేపు మార్చుకుందురుగాని.'' అని సలహా యిచ్చి మరో బస్సులో వాళ్లని మళ్లీ కొత్త హాస్టలుకే పంపించారు.

అక్కడ వాళ్లు ''మీరు గదుల కద్దె కట్టాలి'' అన్నారు.

''నేను ముందే కట్టాను'' అంటూ గోపాల్రావు కొవత్తి వెలుగులో రసీదు వెదికి పట్టుకుని చూపించాడు.

''క్షమించాలి. మాకిచ్చిన కాయితంలో ఆ విషయం లేదు. రేపు రాక్రాసాబ్‌తో మాట్లాడండి'' అన్నాడు అరోరాసాబ్. గోపాల్రావు జవాబివ్వలేదు.

''ఇల్లాంటి భారీ ఏర్పాట్లు చేస్తున్నప్పుడు చిన్న చిన్న పొరపాట్లు జరుగుతూ వుంటాయి'' అన్నాడు మళ్లీ అరోరాసాబ్.

''ఈ రాత్రి భోజనాల మాటేమిటి ?'' అడిగాడు గోపాల్రావు.

''ఇక్కడేం దొరకదు. అడవి. ఇందాక మెయిన్ ఆఫీసుకు వెళ్లినప్పుడు తినేసి రావాల్సింది.''

''ఆ విషయం అప్పుడు చెప్పాల్సింది.''

''మీరు తిరిగి ఈ హాస్టలుకే వస్తారనుకోలేదు. క్షమించాలి.''

క్షమాపణలతో గోపాల్రావు కడుపు నిండిపోయింది. ఆ రాత్రికి, మిగిలిన ఆకలిని తమతో తెచ్చుకున్న చేగోడీలతోను బిస్కెట్లతోను తీర్చుకున్నారు. వాటర్ బాటిల్‌లో మిగిలిన నీళ్లని, రామేశ్వరంలో గంగాజలాన్ని వాడుకునే అంత పొదుపుగా వాడుకున్నారు. ఇనప మంచాలమీద హోల్డాళ్లు వేసుకుని పడుకున్నారు.

తెల్లారాక ఎవరో కుర్రాడు టీనీళ్లు బెడ్డు రూమ్స్‌కి తీసుకువచ్చి ఇచ్చాడు. అవి తాగి నిద్రల్లేచారు జనం. స్నానానికి, కాలకృత్యాలకి నీళ్లు లేవు. జనం ఉగ్రులైపోయారు. రాక్రాసాబ్ అంతు జూస్తామన్నారు. ''మా దగ్గర ఖరీదైన హోటళ్ల రేట్లు పుచ్చుకుని థర్డ్ క్లాసు వెయిటింగ్ రూము కన్నా అన్యాయమైన గదులిస్తాడా ?'' అన్నారు. అనూరుకోలేదు ''చూస్తాం'' అని బెదిరించారు. అరోరాసాబ్ పరిగెత్తుకు వెళ్లి, వచ్చేటప్పుడు జీపులో మనుష్యుల్ని తెచ్చాడు. వాళ్లు ఏవేవో చేసారు. నీళ్లు, లైట్లు వచ్చాయి, రాత్రికి పరుపులు వస్తాయన్నారు.

''అవొచ్చేసరికిఇవిపోతే ఊరుకోం''అన్నారువీళ్లు.

''ఎందు కూరుకుంటారూ ! ఊరుకోరు'' అన్నారు వాళ్లు.

మనుష్యులు స్నానాలు చేసి కూర్చున్నారు. ఎనిమిదిన్నరకి వస్తుందనుకున్న బస్సు, ఠంగున తొమ్మిది కొట్టేసరికల్లా వచ్చింది. గోపాల్రావు, మణి, సిద్దయ్య మిగిలిన జనం బస్సెక్కారు. ఆ బస్సు కాన్ఫరెన్స్ జరిగే చోటుకి తీసుకువెళ్లింది. అక్కడ మెయిన్ ఆఫీసులో ముందర డెలిగేట్స్ రిజిస్ట్రేషన్ పూర్తి చేసుకుని ఆపైన ఇనాగరేషన్ జరిగే హాలుకి వెళ్లాలన్నారు.

## ఇనాగరేషన్

రిజిస్ట్రేషన్ దగ్గరంతా గందరగోళంగా ఉంది. పదిమంది జనం పన్జేస్తున్నారు. వాళ్లమీద నూరుమంది జనం దాడి చేస్తున్నారు. గోపాల్రావుకి ఆశ్చర్యం వేసింది. పెద్ద పెద్ద సైంటిస్టులు, ప్రొఫెసర్లుకూడా చేపల బజారులోలాగా ఎగబడుతున్నారేమిటా అని. ఇదే కాబోలు నేషనల్ కారెక్టర్ అంటే అనుకున్నాడు. పది నిముషాల్లో వెనకాతల వారి తోపుల్తో గోపాల్రావు ఓ అమ్మాయి ముందర వచ్చి నిలబడ్డాడు. పేరు జెప్పాడు.

''ఇది జి కౌంటర్''

''నా పేరు జి తోనే మొదలవుతుంది.''

''ఇక్కడ లేదు ఆర్ ట్రయి చెయ్యండి.''

## యువతరం



“ఖేలన” బృందంలో వుండి వాళ్ల టీచర్ శ్రీమతి కనకదుర్గతో కలసి ఎన్నో ప్రాంతాలు భిలాయ్, భోపాల్ లాంటి చోట్లకు కూడా పోయి డాన్స్ ప్రోగ్రామ్‌లలో పాల్గొన్న కుమారి టి. నిర్మల యింటర్‌మీడియేట్ చదువు కుంటూనే ‘డాన్స్’లో విజయవాడ ప్రభుత్వ సంగీత నృత్య కళాశాల డిప్లొమాలో సెకండ్ క్లాస్ సంపాదిం చింది. ఈ మధ్యనే తాను టీచర్‌గా బాల బాలికల చేత ఒక స్కూల్లో ప్రద ర్శన లిచ్చింది. ‘డ్యాన్స్ ట్రూప్’తో ఏదైనా ప్రోగ్రాం యివ్వటం చాలా కష్టం అని అప్పటికిగాని తెలియరాలే దన్నది! ఆనాడు కుమారి నిర్మల చేసిన “నెమలి నృత్యం” ప్రేక్షకులందరి ప్రశంసలను అందుకుంది. “సోది” ‘మొక్కజొన్నతోటలో’ లాంటి జానపద నృత్యంతోపాటు కృష్ణ శబ్దతలాంటి కూచిపూడి సంప్రదాయ నృత్యం చేయటం కూడా ఎంతో ‘సర్దా’ అని చెప్పిన నిర్మలకి తీరిక వున్నప్పుడల్లా భరతనాట్యం ప్రాక్టీసు చేసుకోడమే ప్రధానమైన హాబీ! చాలామంది అప్ప చెల్లెళ్ల మధ్య ఆఖరి పాపగా పెరిగినా గారాలు పోకుండా తన పనులన్నీ సొంతంగా చేసుకోడం, ఆడపిల్లలుకూడా సొంతకాళ్లమీద నిలబడే విధంగా ఎదగా లనుకోడం — అలవాటు చేసుకున్న యీ అమ్మాయి ‘వక్కపొడి’ నమలడంకన్నా దురభ్యాసాలేమీ చేసుకోలేదని చెప్పింది. రెండు పిల్లల పాఠశాలల్లో పార్ట్ టైమ్ డ్యాన్స్ టీచర్‌గా వుంటూనే యీమధ్యనే సంగీతం కూడా నేర్చు కుంటున్నానని చెప్పింది!

‘సినిమా అంతగా చూడనంది’ పాత దేవదాసు చూసింది. అందులో రాగిణి డ్యాన్స్‌లున్నాయిగా!

పత్రికల్లో సీరియల్‌లు “వారూ వీరూ” అన్న ప్రత్యేకాభిమానం లేకుండా చదివేస్తానంది. సినిమా తారలను చూడాలని ఎందుకుండదు ? కృష్ణని విజయనిర్మలని చూడటం తటస్థిం చింది. మొన్నీమధ్య కొల్హాపూరులో ‘ప్రోగ్రాం’ యివ్వటానికి టీచర్‌తో వెళ్లగా జలగం వెంగళరావుగార్ని చూసింది. ‘శారద’ మీదా శోభన్‌బాబు మీదా అభిమానం వుంది.

గ్రాడ్యుయేట్ కూడా అయిపోయి డ్యాన్స్ లెక్చరర్ అవ్వాలనుంది. సంప్ర దాయబద్ధమైన డ్యాన్స్‌లతోపాటు ‘ట్విస్ట్’ కూడా కొంచెం నేర్చుకున్నా నని చెప్పిన టి. నిర్మలకు ‘మరీ దూర మైతే’ తప్ప ‘నడవటమే’ అలవాటు. రాజకీయాలమీద యిష్టం లేదు... ‘నాగ నృత్యం’, ‘నెమలి నృత్యం’ అవీ చేస్తున్నప్పుడు స్టేజిమీద తప్ప వింత వేషధారణ, అల్ట్రామోడర్న్ ఫ్యాషన్‌లు సరదాలు లేవన్నది. కుమారి నిర్మలకి జీవితం వడ్డించిన విస్తరి కాదు... సాధనతో సాధించాల్సినదన్న ధ్యేయం వున్నది! అదే ‘రైటు’ కదా!

—వీరాజీ ★



“అదెక్కడ ?”

“ఎడంచేతి పక్కనున్న మూడో అమ్మాయి.”

ఆ మూడో అమ్మాయి తను కాదని పక్క అమ్మాయిని చూపించింది. తను ఆర్ ఓ డబ్ల్యుతో డీల్ చేస్తోందిట. ఆర్ ఎ ఓ పక్కన అంది. గోపాల్రావు పక్కకి జరిగాడు. ఆ పిల్ల అయిదు నిముషాల పాటు కాయితాలన్నీ గందరగోళం చేసేసి “మీరు కాన్ఫరెన్స్‌కి రావటంలేదని మీ పేరు కొట్టే సారు” అంది.

“నేనల్లా ఎవరికి రాయలేదే!”

“రాయలేదా ?... రాక్రాసాబ్ !” అంటూ కేక పెట్టింది.

ఎక్కడకు వెళ్లినా ఈ రాక్రాసాబ్ పేరు విని పిస్తోందే అని ఆశ్చర్యపోయి అత్రనాగానే “ఎవ్వనిచే జనించు” అంటూ గోపన్న భక్తిగా పద్యం పాడు కున్నాడు మనస్సులో.

“ఈయన పేరు లేదు లిస్టులో. పైగా ఆయన్దగ్గర రసీదు లున్నాయి.”

“అల్లాగా. అయితే ముందర ఈ బొత్తి ఇన్విటేషన్లు, బాగ్ అవీ డాక్టర్ గోపాల్రావు కివ్వు” అంటూ మరొకరి కోసం పేరుపెట్టిన బొత్తి తీసి ఇచ్చాడు.

“అవతలి శాల్తీ వస్తే!” అంది ఆ అమ్మాయి అనుమానంగా.

“అప్పుడు జ్జూద్దాం... డాక్టర్ గోపాల్రావ్! మీకు మధ్యాహ్నం లంచ్, సాయంత్రం టీ ఇక్కడే ఏర్పాటు చేస్తున్నాం. మీ భార్యకి కూడా! రాత్రిళ్లు మీ ఏర్పాట్లు మీరే చూసుకోవాలి. రోజూ రాత్రి ఓపెన్ ఎయిర్ ఆడిటోరియమ్‌లో ఎంటర్‌టెయిన్‌మెం టుంటుంది. ఇవాల్టి టిక్కెట్లు అయిపోయాయి. రేపు డాన్సువి ఇస్తున్నాను తీసుకోండి.” అంటూ వివరాలిచ్చాడు రాక్రాసాబ్.

గోపాల్రావు కష్టమో నిష్ఠూరమో ఆ హాస్ట

## కాన్ఫరెన్సుల తిరునాళ్లు

ల్లోనే ఉండదల్చుకుని రాక్రాసాబ్‌ని మార్చమని అడగ లేదు.

గోపాల్రావ్ వెళ్లి సిద్దయ్యతో “మా యిద్దరికి తిండి ఏర్పాట్లిక్కడే చేసారు మావయ్యా! నువు బయటికి వెళ్లి భోంచేసి రావాలి.” అని చెప్పాడు.

“నా గొడవ నే బడతాలేరా!” అన్నాడు సిద్దయ్య. మంత్రిగారొచ్చే టయిమైంది. డెలిగేట్లు, వాళ్ల స్వజనం హాల్లో సర్దుక్కూర్చున్నారు. సిద్దయ్య బయటే నిలబడ్డాడు.

మంత్రిగారు గంటన్నర ఆలస్యంగా వచ్చారు. సిద్దయ్య ఎదురెళ్లి నమస్కారం పెట్టాడు. సిద్దయ్య వేసుకున్న ఖద్దరు బట్టలు, అతన్లోని చొరవ, అంతకుమించి చదువుకోని వాలకం గమనించి “మనోవాడే” అనుకున్నారు మంత్రిగారు. అందుకని “బావున్నారా ?” అని అడిగాడు తెలుగులో.

“మీరు... పంచాయితీకి వచ్చినప్పుడు ఏర్పాట్లు చేసింది నేనే. గుర్తున్నానా ?” అని అడిగినట్టుగా తనెవరో గుర్తు చేసాడు. మంత్రిగారికా ఏర్పాట్లు గుర్తున్నాయి. అందుకని తన పదవి పోయేలోపల మరోసారి అక్కడికి వెళ్దాం అనుకుంటున్నాడు.

“మంచివారే! మీరు గుర్తులేకుండా నా ? సుబ్బారెడ్డిగారెల్లా ఉన్నారు ? మిమల్నందర్నీ చూడ టానికి ఓసారి మీ ఊరొద్దాం అనుకుంటున్నా” అంటూ చనువుగా సిద్దయ్య భుజంమీద చెయ్యేసి లోపలికి నడిచారు మంత్రిగారు. “తప్పకుండా రండి” అంటూ సిద్దయ్య ఆహ్వానించాడు.

మంత్రిగారితో వస్తున్న సిద్దయ్య మావని చూసి గోపాల్రావాశ్చర్యపోయాడు. మంత్రిగారు స్టేజెక్కేవరకు సిద్దయ్య పక్కనే కూర్చున్నారు. ఆర్గనైజర్స్‌కి సిద్దయ్యకి మర్యాద చెయ్యక తప్ప లేదు.

కాన్ఫరెన్సు హాల్లో, నడికొప్పు ముళ్లవాళ్లు, వాల్జెడలవాళ్లు, స్లీవ్‌లెస్‌వాళ్లు, ఫుల్ స్లీవ్స్‌వాళ్లు, రక రకాల ఆడవాళ్లున్నారు. కాన్ఫరెన్సు హాలు పెళ్లి నాటి రిసెప్షన్‌లాగా కోలాహలంగా ఉంది. మంత్రి గారు పదకొండూ పది వేసేసరికల్లా వేదికమీదకు ఎక్కారు. ఆయనతోపాటు ఆ యేటి కాన్ఫరెన్సుకి అధ్యక్షుడైన ప్రొఫెసర్ నవనీతచోర్ వేదికమీదకు వెళ్లాడు.

గాయకులు మృదు మధురంగా ప్రార్థన పాడారు. మంత్రిగారు నమస్కారం పెట్టి కూర్చున్నారు. ఆపైన కార్యదర్శి వచ్చి మంత్రిగారు పొద్దున్నే డెహ్రాడూన్ నుంచి కాన్ఫరెన్సుకి సరియైన టైముకి జేరుకోవాలనే సదుద్దేశంతో కార్లో బయల్దేరారని, అయితే దార్లో ప్రజలు చీటికి మాటికి కారాపి కష్ట సుఖాలు వెళ్లబోసుకోడం, సున్నిత మనస్కులైన మంత్రిగారవన్నీ ఓపిగ్గా వినటంవల్ల ఆలస్యం అయిం దని చెప్పాడు. గోపాల్రావ్ వెనకాత లెవరో “ఘెరావో చేసారని చెప్పరాదూ ?” అని నెమ్మదిగా అన్నారు.

పదకొండున్నరకి మంత్రిగారు లేచారు. నమ స్కారం పెట్టారు. తనకారోజు కార్యవర్గంవారు కార్యక్రమంలో ఓ పావుగంట కేటాయించారని, ఇచ్చినంతలోనే ముగిస్తానని చెప్పి మంత్రిగారుపన్యాసం అందుకున్నారు. అందులో ఆర్ అండ్ డి అన్నారు. ఎస్ అండ్ టి అన్నారు. ఎ అండ్ బి అన్నారు. నెహ్రూ అండ్ గాంధీ అన్నారు. అదీ అండ్ ఇదీ అన్నారు. ఇంకా చాలా అన్నారు. అయితే ఉపన్యాసం చాలా జనరల్‌గా ఉంది. ఎంత జనరల్‌గా ఉందంటే ఆ ఉపన్యాసం ఏ పరిస్థితుల్లో ఇచ్చినా అతికిపోతుంది. ఎవరికి ఉపయోగపడనంత జనరల్‌గా ఉంది. పన్నెం డయ్యేసరికి మంత్రిగారు నమస్కారం పెట్టి ఉప న్యాసం ముగించి తనకి వేరే పన్లున్నాయని సభకి శుభాకాంక్షలు, క్షమాపణలు చెప్పుకుంటూ నిష్క్ర మించారు.

[ఇంకా వుంది]

తప్పక చూడండి!

మనోరంజని పిక్చర్స్

# భారతి

నిర్మాత: కె.వి.రెడ్డి కథ-స్క్రీన్‌ప్లే-మాటలు-దర్శకత్వం: పటూరి కెమెరా: దేవరాజ్

సంగీతం: కీ.శే. ఎస్.పి.కోదండపాణి నేపథ్యసంగీతం: సత్యం






## డాక్టరుగారి కూతురు

(16 వ పేజీ తరువాయి)

"లేదు" అని నాతో డాక్టరు వాదిస్తే వినాలన్న కుతూహలంతో.

"నాకూఉంది అందుకే ఇలాఅయింది"

ఏలానో నా కర్థంకాలేదు మూఢనమ్మకాలుండడానికి, విస్కీ తాగడానికి సంబంధమేవిటోనని — "ఇప్పుడేమయింది" అనడిగాను

"చెబుతాను మీ నాన్నకీ విషయం చెబుతావనే ఈ రాత్రికిక్కడ ఉండమన్నాను గ్లాసులో ఐస్‌క్యూబ్ వేసుకుంటూ అన్నాడు "రవిచందర్‌ని శైలజ ప్రేమించింది"

"కాదు శైలజనే రవిచందర్ ప్రేమించి ఉంటాడు" డాక్టరుగారితో ఇదివరకు మేం అలా మాట్లాడితేనే మమ్మల్ని బాగా నవ్వించే వాడు

సీరియస్‌గా అన్నాడు "ఇట్ మేక్స్ నో డిఫరెన్స్ వాళ్లిద్దరూ పెళ్లి చేసుకోవాలని అనుకున్నారు నాకేం అభ్యంతరంలేదు కానీ, మీ నాన్న నామీద ఓ మూఢనమ్మకం తూటా పేల్చాడు-"

"ఏవిటుది?" రెండో సిగరెట్ వెలిగించాను

"రవిచందర్ వాళ్లింట్లో వంశ పారంపర్యంగా ప్రథమ కళత్రాలు పోతారట నేను భయపళ్లేదు మీ నాన్న మరీ భయపెడితే రవిచందర్ని వాళ్ల లాయర్ నాన్ననీ అడిగి తెలుసుకుంటే నిజమేనట నాకు తెలిసిన జ్యోతిష్యుల్ని సంప్రదిస్తే నేనిచ్చే ఫీజును బట్టి అవును, కాదు, అన్న గోడమీది పిల్లి జోస్యంచెప్తే, ఆ పుస్తకాలు నేనూకొని చదివేటప్పటికి-నిజమేమో అన్న అనుమానం నాకూ వచ్చింది."

నేను వింటూ కూర్చున్నాను

"రవిచందర్‌కి శైలజకి—మేం ఒకటే కదా ఇక—అన్న ఆనందంలో ఏదో తప్పు చేస్తున్నామన్న తెలివికూడ వచ్చింది ఇక అలాంటప్పుడు నేనెట్లా ఆగను!"

సిగరెట్ ముట్టిస్తూ అన్నారు డాక్టరుగారు "శైలజని ఒప్పించి, మీనాన్నా, నేనూ కలిసి అలా కటక్‌దాకా వెళ్లి, ఓ ఒరియా పిల్లని కొనుక్కొచ్చి, రవిచందర్‌కి పెళ్లి చేశాం"

"నేనప్పుడు సుగర్ టెక్నాలజీలో ట్రైనింగ్‌కి స్విట్జర్లెండు వెళ్లానులెండి"

"ఎగ్జాక్ట్లీ శైలజకూడా ఏం బాధపళ్లేదు పైగా ఆ అమ్మాయిని బాగా ట్రైన్ చేసింది పాపం, కొన్నాళ్లకిక చనిపోతుందేమోనని జాలిగా నా దగ్గర అనేది ఆ పిల్ల పేరు దుఃఎంగా దానికి అందంగా, నిర్మల అనేపేరు తనే పెట్టింది"

నేను ఆమ్లెట్‌ని రుచిచూస్తూ అడిగాను, "అవునూ ఆ అమ్మాయి చనిపోయిందని విన్నానే రవిశైలజని పెళ్లిచేసుకోవచ్చుగదా" అన్న వెంటనే నాలిక కరుచుకున్నాను. తొందరపడ్డానేమోనని

డాక్టరుగారు ముఖం చిట్లించారు "దుఃఎంగా ఎంతకీ చావలేదు ఇక చావదేమోనన్నభయంతో ఓ రోజు, నేనే"

పక్కనెక్కడో బాంబు పేలింది

ఆ శబ్దానికి డాక్టరుగారు కూడ చెవులు మూసుకన్నారు చేతుల్నితీస్తూ అన్నారు "అక్కడికి శైలజ ఎలా వచ్చిందో తెలీదు అదంతా చూసింది అప్పట్నుంచి అదీపరిస్థితి"

గళ్లపడికట్లు (36 వ పేజీ తరువాయి)

| | | | |
|---|---|---|---|
| 1 | 15 | 14 | 4 |
| 12 | 6 | 7 | 9 |
| 8 | 10 | 11 | 5 |
| 13 | 3 | 2 | 16 |

| | | | |
|---|---|---|---|
| 4 | 14 | 15 | 1 |
| 9 | 7 | 6 | 12 |
| 5 | 11 | 10 | 8 |
| 16 | 2 | 3 | 13 |

| | | | |
|---|---|---|---|
| 4 | 9 | 5 | 16 |
| 14 | 7 | 11 | 2 |
| 15 | 6 | 10 | 3 |
| 1 | 12 | 8 | 13 |

| | | | |
|---|---|---|---|
| 16 | 5 | 9 | 4 |
| 2 | 11 | 7 | 14 |
| 3 | 10 | 6 | 15 |
| 13 | 8 | 12 | 1 |

| | | | |
|---|---|---|---|
| 13 | 3 | 2 | 16 |
| 8 | 10 | 11 | 5 |
| 12 | 6 | 7 | 9 |
| 1 | 15 | 14 | 4 |

| | | | |
|---|---|---|---|
| 16 | 2 | 3 | 13 |
| 5 | 11 | 10 | 8 |
| 9 | 7 | 6 | 12 |
| 4 | 14 | 15 | 1 |

| | | | |
|---|---|---|---|
| 13 | 8 | 12 | 1 |
| 3 | 10 | 6 | 15 |
| 2 | 11 | 7 | 14 |
| 16 | 5 | 9 | 4 |

| | | | |
|---|---|---|---|
| 1 | 12 | 8 | 13 |
| 15 | 6 | 10 | 3 |
| 14 | 7 | 11 | 2 |
| 4 | 9 | 5 | 16 |

మిగిలిన పెగ్గు వ్వరనీ ఒకేసారి తాగేడు.

అలా చూడాలని నాకు తెలియకుండా డాక్టరుగార్ని నిశితంగా చూశానేమో—డాక్టరు గారు కొంచెం వణికారు ముఖమంతా చెమటలు పట్టింది. ఏదో చెప్పరానిది నాతో చెప్పివేశానన్న భయమో. మరింకేదో... ఆయన్ని కలవర పెట్టడం నేను గమనించాను. మరెందుకు చెప్పాడో అర్థంకాదు. మళ్ళీ బీరు వా దగ్గరికెళ్ళి మరో నిండు బాటిల్ తీశాడు.

ఇక రాత్రికి నిద్రఉండదేమో అనుకుంటూ "శైలజ ఇంకా రాలేదా." అనడిగాను.

"ఎక్కడి నుంచి?" ముఖం చిట్లిస్తూ అడిగారు.

ఆయన్ని కూచోనిచ్చాను గ్లాసులో వంపుకోనిచ్చాను ఓ గుక్క తాగనిచ్చాను ఆ కంగారు నా కేదో చెప్పేశానన్న భయంలాంటి కంగారు తగ్గగానే.

"చదువుకుంటుంటే చూశాను ఇప్పుడే వస్తాననిచెప్పి బయటికివెళ్ళింది" డాక్టరుగారు లేచారు "గవర్రాజూ" అంటూ పెద్దగా అరిచారు 'తాళం ఎవరు తీశారని నా మీదగుడ్లురిమాడు'

నేను ఎప్పుడు లేచానో నాకే తెలియదు "శైలజ తీయనుంటే నేనే తీశాను"

"యూ బ్రూటస్..." అంటూ తాగేగ్లాసుని నేలమీద కొట్టాడు

గవర్రాజుని మళ్లీ కేకవేశాడు. "ఈ రాత్రికి ఎక్కడికి వెళ్ళిందో ఏవిటో అందులో అమావాస్య. చీకటి. కమాన్ లెటజ్ గో" డాక్టరుగారి గొంతులో జీర.

నేను షరు వేసుకుంటూ అనాలోచితంగా అన్నాను. "ముందర పోలీస్ స్టేషనుకి ఫోన్ చెయ్యండి"

ఒకర్నొకరం తోసుకుంటూ డ్రాయింగ్ రూమ్‌లోకి వచ్చాం

ఫోన్‌మీద రిసీవరు టేబిల్ మీద పెట్టి ఉంది. నే నటూ ఇటూ చూశాను.

కిటికీలోగుండా చీకట్లోకి చూస్తున్న శైలజ కన్పించింది. "శైలజా" అని పిలిచాను పెద్దగా.

నావేపు తిరిగింది. తన నోట్లో నా టూత్‌బ్రష్. ఎడంచేతిలో ఎర్రటి టంగ్ క్లీనరు. నాదే.

పళ్ళు తోమడం ఆపి... నోట్లోంచి బ్రష్‌తీసి నావేపు చూస్తూ నిర్మలంగా నవ్వి అంది.

"గుడ్ మార్నింగ్."

# హైదరాబాద్ నోట్ బుక్

**మంత్రుల ఆస్తులు**

మంత్రులు, శాసనసభ్యులు, సహకార సంఘాలు పంచాయతీరాజ్ లు వంటి సంస్థల సభ్యులు తమ ఆస్తి అప్పులను ప్రకటించడం అవసరమన్న సూచనను ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు శాసన సభలో అంగీకరించడం చాలా భాగుంది సంఘంలో సాధారణంగా జీవితం గడిపేవారు ప్రజా సంస్థలలో చేరిన తర్వాత సొధ్యమైనంత త్వరలో శ్రీమంతులయిపోతున్నారని ప్రజలలో అపోహ ఉంది అలాటి అపోహ పోగొట్టడమే కాక, తమ చిత్తాన్ని పరిశుద్ధంగా పెట్టుకోవడమూ ప్రజా ప్రతినిధుల కర్తవ్యం గనుక ముఖ్యమంత్రి సూచన మేరకు తమ ఆస్తి అప్పులను ప్రకటిస్తారని ఆశించవచ్చు నూతన నియమావళి ప్రకారం ప్రజా ప్రతినిధుల ఆస్తిపాసులు గెజెట్‌లో ప్రకటిస్తే ప్రజలకు సందేహాలు తొలగిపోవడమే కాక, గౌరవం కూడ కలుగుతుంది

**లాల్ బహదూర్ స్టేడియంలో ఏర్పాటు**

ప్రపంచ తెలుగు మహాసభలు జరిగే లాల్ బహదూర్ స్టేడియంను సుందరంగా అలంకరిస్తున్నారు సభకు ఏర్పాట్లన్నీ గొప్పగా సాగుతున్నాయి ఈ మహాసభకు 100 మంది విదేశ ప్రతినిధులు, దేశంలోని అన్ని ప్రాంతాల నుంచి 3000 మంది ప్రతినిధులు వస్తారు. వారంపాటు జరిగే ఈ మహాసభలను, ఉత్సవాన్ని 60 వేల మంది చూడడానికి తగిన ఏర్పాట్లు జరిగాయి. మహాసభా మండపానికి మూడు ద్వారాలు, చారిత్రక నామధేయాలతో నిర్మింపబడినాయి మండపం మధ్యన వేదిక 40 అడుగుల వ్యాసంతో, చుట్టూ కాకతీయ శిల్ప చిత్రాలతో నిర్మించబడింది సింహద్వారం బషీర్ బాగ్ వైపు. ఈ ద్వారానికి ఇరువైపుల వివిధ దేశాల పతాకాలను ఎగురవేయడానికి 20 అడుగుల ఎత్తు ఇనుప స్తంభాలు నాటబడ్డాయి

**శ్రీ కొండా లక్ష్మణ్ రాజీనామా**

ప్రపంచ తెలుగు మహాసభ ప్రచార సంఘం ఉపాధ్యక్షులు, సన్నాహక సంఘ సభ్యులు శ్రీ కొండా లక్ష్మణ్‌బాపూజీ ఆ పదవులకు రాజీనామా యిచ్చారు మహాసభ సన్నాహ సంఘంలో మూడు ప్రాంతాలకు తగిన ప్రాతినిధ్యం లేదని, తెలంగాణాలోని తెలుగువారి ఎడల అశ్రద్ధ చూపినట్టు వారు భావిస్తున్నారని, ఆయన తెపారు ఉత్సవాలు విజయవంతంగా జరగడా

(50వ పేజీ చూడండి)

సరిక్రొత్తది

# అత్యంత లాభదాయకమైన

# బిజ్

## సాటిలేని ఫలితాలనిచ్చే శుభ్రపరచే పౌడర్





ఒక క్రొత్త
500 గ్రా.
మీడియమ్ ప్యాక్
కేవలం
రూ. 1.75
మాత్రమే
(పన్నులు అదనం)







ఒక్క బిజ్ మాత్రమే క్రొత్త 500 గ్రా మీడియమ్ ప్యాక్‌లో వస్తోంది దాని వెల కూడ కేవలం రూ 1 75 (పన్నులు అదనం) ఇంకా ఎక్కువ లాభం పొందాలంటే మొదట మళ్ళీ మళ్ళీ వాడదగిన ప్లాస్టిక్ డబ్బాలో వచ్చే బిజ్ కొనండి ఆ తరువాత దీని ఖాళీ డబ్బాలో అత్యంత లాభదాయకమైన 5 రిఫిల్ లేక 2-రిఫిల్ ప్యాక్‌లు కొనుకొని నింపండి మీ వంట యింటి సామాను గాజు సామాను లలు స్నానాల గదులు మొదలైన వాటిని బిజ్‌తో శుభ్రపరచండి అప్పుడు చూడండి దాని అపూర్వమైన తళతళ దానితోపాటు పొందండి అద్భుతమైన లాభం

# బిజ్ ఉత్పత్తి గోద్రెజ్

అద్భుతమైన శుభ్రపరచే పౌడర్—
అధికంగా ఆదా చేసుకునే అవకాశం!

CMGS-64 2-4 TLB

*(గత సంచిక తరువాయి)*

మధురస్మృతులతో పొంగిపోతూ టేబుల్ పైన వున్న ఫొటో అందుకుని పైటతో తుడిచి కళ్లు తుడిచి ఫోటోలో వున్న రామ్ చరణ్ వైపు ఆరాధనగా చూస్తూ పెదాలు తాకించింది ఎప్పుడు వచ్చాడో ఏమో ! "సీతా!" అంటూ ముందుకు వంగాడు రామ్

ఆ రోజు రామ్‌చరణ్ స్టాఫ్ రూములోకి పోతుండగా ఓ మూల తెలుగు లెక్చరర్ బల్లపై తల ఆనించుకొని వుంది ఆ తీరు కన్నులు చూసి ఏడుస్తున్నదని తెలుసుకున్నాడు ఒకసారి పునీత అలాగే ఏడుస్తుంటే వెళ్లి పలుకరించాడు పునీత ఎంతమంచిది అలాటి స్త్రీ దొరకటం అపూర్వం మాణిక్యం లాంటిదాన్ని మట్టిపాలు చేశాడు గోపాల్ జాలి-ప్రేమ-మమత పొంగిపొర్లగా పునీతను అక్షణమందే మూడోకనిపించింది ఇంటికి వెళ్లాడు

పనిమనిషి బయటకూర్చుని వుంది "అమ్మగారు ఆస్పత్రికి వెళ్లింది" అని చెప్పింది

"ఎందుకు? ఏమైంది?" అని ప్రశ్నల వర్షం కురిపిస్తుండగానే యింటి ముందు రిక్షా ఆగింది చెయ్యి అందించాడు 'అపురూపంగ ఏ దేవతా హస్తమో' అన్నట్లుగ అందుకొంది.

గదిలోకి పోగానే 'పునీ! ఎందుకు వెళ్లావు?' అన్నాడు వణుకుతున్న చేతుల్లో ముఖం దాచుకుంది

"కన్నీరా? ఛా! ఛా!" అని బుజ్జగింపుగా గర్భవతినని లతి మెల్లగా చెప్పింది

శ్వాస బంధించి-కళ్లు విప్పారించి సంభ్రమంగ చూస్తూ "సీతా!" అంటూ సందిట్లోకి చేర్చుకున్నాడు అతని ఆనందాతిశయంలో కొట్టుకుంటున్న హృదయపు స్పందన విన్నది అంత వేగంగా తనగుండె కొట్టుకుంటున్నది ఆ క్షణంలో తాను చచ్చిపోతే చాలు అనుకొంది కన్నీటి ప్రవాహాన్ని ఆపుకోచూస్తూ "రామ్! నా కడుపులోవుంది మన పాప కాదు."

"మరి???"

'భగవాన్!' అని మూలిగింది ఎలా చెప్పాలి ఆ బిడ్డ గోపాల్ స్మృతి అని

పునీతన చుట్టిన చేతులు సడలినాయి ఆ పట్టులోని మధురిమ కారిపోతుందా! అనిపించింది కాని రామ్ చరణ్‌లోని స్నేహితుడు మేల్కొన్నాడు ఆ క్షణంలో. భార్యకి అని వున్న




ఆ తలను నిమిరాడు ఓదార్పుగా

ఆ రాత్రి రామ్‌చరణ్ నిద్రపోతున్నా మనస్సు నిద్రపోలేక పోయిందని ప్రక్కనే పడుకున్న నిద్రపోని పునీత తెలుసుకుంది

తెల్లవారింది కళ్ళు తెరిచి చూసిన రామ్ కళ్లకి పునీత కనపించింది

మెల్లిగా నవ్వాడు చేరుట చాచాడు మామూలుగా హృదయంపై వాలిపోయి వెక్కి వెక్కి ఏడ్చింది "నన్నేం చేయమంటారో చెప్పండి నన్ను పంపేస్తారా? ఏ శిక్ష అయినా విధించండి మీ ముందునుంచి నన్ను పంపకండ' అంది వెక్కిళ్ల మధ్య

రామ్‌చరణ్ గొంతు బొంగురు పోయింది అతని కన్నులు నీటిలో నిండి మసకగా అయ్యాయి

"పిచ్చిపిల్లా! సీతా! నీవు నా భార్యవి నేనే కాదు నా ప్రాణం వుండగా ఆ భగవం తుడుకూడ నా నుండి నిన్ను వేరుచేయలేడు" వీపు నిమురుతూ దగ్గరగా-మరీ దగ్గరగా హత్తుకున్నాడు తీగలా పెనవేసుకు పోయింది పునీత

### జైల్లో షష్టిపూర్తి

జాన్సన్ వాండికి గ్రిగ్స్‌బి అన్న ఆసామి ఇటీవలనే ఇండియానా జైలునుంచి 66 సంవత్సరాల శిక్ష అనుభవించి విడుదలయ్యాడు "నేను యిప్పుడే పుట్టినట్లుగా అనిపిస్తోంది అన్నాట్ట ఆయనగారి జైలు జీవితం 1908 ఆగస్టు 5 వ తేదిన ప్రారంభమైందట 66 ఏళ్ల జైలు శిక్ష అనుభవించి లోగడ రికార్డును అధిగమించాట్ట లోగడ రికార్డు 64 ఏళ్లు రివర్ హానెక్ 1899 నుంచి 1963 వరకూ జైల్లో వున్నాట్ట!

చెప్పులు వేసుకొంటూ సీతా! లేడిడాక్టరుని పిలుచుకు వస్తాను తయారుగా వుండు" అన్నాడు

బల్లమీది పుస్తకం-పెన్ను తీసుకోస్తున్న దల్లా అక్కడే ఆగిపోయింది "డాక్టరమ్మ! ఇప్పుడెందుకు?" అంది

దగ్గరకు వెళ్లి పునీత చెయ్యి పట్టుకొని "సీతా! బాగా ఆలోచించు నేను సామాన్య మానవుణ్ని మరొకరి బిడ్డని ప్రేమించే శక్తి సహనం నాకు ముందు ముందువుండకపోవచ్చు. ప్లీజ్! నన్ను అర్థం చేసుకో" అంటూ వెళ్ళిపోయాడు

"అలా వెళ్లిపోయిన రామ్‌చరణ్‌ని చూస్తూ వుండిపోయింది నిజమే! అతనూ మనిషే! తను పొందిన సౌఖ్యం-తనకోరకు అతనుచేసిన త్యాగాలు అతని నుంచి పొందిన ప్రేమానురాగాలు-తాను పొందిన తృప్తితో మనస్సు నిండిపోయింది ఈ కడుపులో పాప అతని పాప అయివుంటే అతను పొందే ఆనందం-గర్వం వర్ణనాతీతం అతని ప్రేమ శాశ్వతం-అతనికివుంటే బిడ్డలు ఈ యింట్లో నడయాడుతారు భార్యగా-తల్లిగా అనుభూతి మన సారా తానొక్కతే అనుభవిస్తుంది అవి పొందలేని స్త్రీలు మరలా మరలా తనను చూసి ఈర్ష్య చెందుతారు కాని ఎందుకీ బాధ! ఏదో మనస్సు పీకుతుందే! ముందు కలిగే సుఖం ముందు ఈ బాధ ఏ పాటిది? పాపం అంటుందా మనస్సు- ఓ హృదయమా! నీకు నిజంగ హృదయంలేదు గోపాల్ అబార్షన్ చేయించ లేదూ? కడుపు వస్తుందని కన్నె పిల్లలా భయపడి నెలనెలా మాత్రలు వేసుకో లేదూ! ఎందుకా పాపపు భీతి? తను కొత్తగా నిర్మించుకుంటున్న యింటిని మక్కువగా చూసింది ఈ యిల్లు తన పేరిట కొన్నాడు రామ్‌చరణ్ తన భర్త అన్నిపరుడు కూడ రామ్‌చరణ్ ఫొటో హృదయానికి హత్తుకుంది

భర్త రాకకై ఎదురు చూడసాగింది.

రామ్‌చరణ్ ఆలోచిస్తూ నేరుగా కాలేజీలోకి వెళ్లాడు తానెక్కడికి వచ్చాడో మానుకున్నాడు నవ్వు వచ్చింది పునీత అన్నట్లు జ్ఞాపకశక్తి క్షీణిస్తున్నది పాఠాలు చెప్పాడు. విద్యార్థులను నవ్వించాడు! కడుపు కరకర లాడుతుండగా యింటికి చేరుకున్నాడు.

మంచంపై పడుకున్న పునీత ఎదపై ఏదో చూశాడు. ఫోటో- తన ఫోటో-పిచ్చిగ

నువ్వు నా చెంతన గనక ఉంటే
మత్తెక్కించే సుగంధం చెలరేగుతుంది గాలిలో

కొత్త పెటల్ షవర్ –
నూతన వసంత శోభలో
పరిమళం చిందే పువ్వుల
మెత్తదనంగల టాల్క్




ఒక్క
పెటల్ షవర్
మాత్రమే అందజేస్తుంది
కుసుమ కోమల సౌరభం
ఇంత తక్కువలో!

PST.G.1 TL

ప్రేమిస్తుంది ఆ ప్రేమలో తాను మునిగి పోతానని భయపడిపోతాడు ఆ పడుకున్న తీరు–భంగిమ చూసి మనస్సు ఆర్ద్రమై పోయింది ప్రొద్దున్న అన్న మాటలన్నీ జ్ఞాపకం వచ్చాయి పునీతకు పుట్టిన బిడ్డలు తన బిడ్డలు కారా! ఎంత అవివేకంగా ప్రవర్తించాడు ఆ క్షణం ఎంత పాప కార్యం తలపెట్టాడు పునీతను తల్లిగా ఆశీర్వ

## మనిషి నీడ

దించాలి . అడుగులో అడుగు వేస్తూ వచ్చి ప్రక్కన కూర్చున్నాడు ఎదపైనున్న ఫొటో తీశాడు నుదుటిపై చెదిరి చెమటలో అతుక్కున్న ముంగురులు సవరిస్తున్న చెయ్యి ఆగిపోయింది పునీత గాఢ నిద్రలో వుందా?. లేదు శాశ్వత నిద్రలో కన్నులు మూసుకున్నాయి

'ఆగిపోతుందా!' అనుకున్న గుండె తిరిగి వేగంగా – అతి వేగంగా కొట్టుకుంటూండగా ప్రక్క నలిగిన కాగితం కనుపించి తీశాడు

" రావు! మీ నీడలో హాయిగా విశ్రమించాను "

## రంగుల వల

(12వ పేజీ తరువాయి)

ఫ్రిజ్‌లోంచి అందరికీ మంచినీళ్ళు తెచ్చి ఇచ్చాడు సుందర్రావు

ఆ తర్వాత 'ట్రే'లో అందరికీ కాఫీ తెచ్చి ఇచ్చాడు

తాగేక తనూ వచ్చి కూర్చుని, 'ఇప్పుడు చెప్పండి' అన్నాడు చలమయ్య, భూషయ్య మొహాలు చూసుకున్నారు

సుందర్రావు విచారంగా అన్నాడు 'పోన్లెండి నేను చెపుతాను వినండి, ఈ వ్యవహారమంతా వేటకాడు అల్లిన రంగుల వలలాగ వుంది అయితే ఇదంతా నాకూ తెలీదు నేను నిర్దోషిని నిరపరాధిని నాకు అన్నగారు లేరు మేన మామలూ లేరు ఒకవేళ మీరు వేరే వ్యక్తిని, నన్నుగా పొరపాటు పడుతున్నారేమో! ఆలో చించండి' అన్నాడు

'వేరే ఎవరూ కాదు మీరె ముమ్మాటికి మీరే' రుద్ధకంఠంతో అని మొహం కప్పుకుంది మంజుల

"ఈ వ్యవహారం చిత్రంగా వుంది నేను దైవసాక్షిగా చెప్తున్నాను ఈ నాటకం నాకేం తెలీదు నన్ను నమ్మండి అసలు నాకు ఆ అవసరమేలేదు ఇదంతా ఎవరు చేసారో ఎందుకు చేసారోగాని చాల భయంకరమైన ప్రయోగమే చేశారు అటువంటి వాళ్లు ముమ్మాటికీ క్షమార్హులుకారు" అన్నాడు సుందర్రావు

కాంతమ్మ వెక్కిళ్లు పోయింది

భూషయ్య ఏ క్షణాన్న అయినా పడిపోవటాన్కి సిద్ధంగా వున్నాడు

మంజుల కళ్లు ఎర్రగా అయేయి పిచ్చి దానివలె చూసింది

సుందర్రావు విచారంగా అందర్నీ కలియ చూసాడు 'నిజంగ నేను నిర్దోషిని పాపం మీరు మోసపోయారు అందుకు యాదృచ్ఛికంగా నేను కారణం కావటం నా దురదృష్టం అందుకు నన్ను క్షమించండి ఈ విషయం గురించి ఏ సహాయం మీరు కోరినా అందుకు నేను సిద్ధంగా చేయటాన్కి వున్నాను'

చలమయ్య మొహంలో ఆశారేఖ తొంగి చూసింది భూషయ్య ఆశగా అర్ధవంతంగా చలమయ్య మొహంలోకి చూసాడు

'జరిగిందంతా ఒక పీడకల అనుకుందాం? మేమూ మర్చిపోతాం డాక్టర్! మీరూ మరిచిపోండి పోతే జరగవలసిందాన్ని గురించి ఆలోచించటం విజ్ఞుల లక్షణం ఇప్పటికీ మా అమ్మాయి మిమ్మల్నే నమ్ముకుంది చెప్పొంగదా! మీరు కోరిన కట్నం ఇస్తాం మీరు మా సంబంధం అంగీకరించండి అందరం ఎంతో సంతోషిస్తాము' అన్నాడు చలమయ్య

'మళ్ల ఈ నెల దాటిలే ముహూర్తాలు లేవంటున్నారు' అన్నాడు భూషయ్య ఆనందంగా, ఆదుర్దాగా

డాక్టర్ విచారంగా అన్నాడు 'క్షమించండి అందుకు నేను అర్హుడ్నికాను'

'ఏ? మీకేం తక్కువని? మా అందరికీ మీరు నచ్చారు మీ గుర్చించి మా కెవరికీ ఏ అనుమానాలూ, అపోహలూ లేవు మీరు వూ అనండిచాలు' అంటూ బలవంతం చేసాడు చలమయ్య

డాక్టర్గా, అతని అంతస్తూ, అతని ప్రవర్తనా చలమయ్యకికూడా బాగా నచ్చాయి చలమయ్య అంత సూటిగా వ్యవహారం చెయ్యటం భూషయ్యకి కూడా నచ్చి తమ్ముడ్ని ప్రశంసాపూర్వకంగా చూసాడు

కాంతమ్మా, జాలిగా ఆశగా డాక్టరువంక చూసారు డాక్టర్ విషాదంగా నవ్వాడు. నవ్వి అన్నాడు 'క్షమించండి నాకు రెండేళ్ల క్రితమే పెళ్లయింది ఒక పాప కూడా వుంది వుండండి పరిచయం చేస్తాను' అని 'సుందరీ!' అని పిల్చాడు డాక్టర్ లోపల్నుంచి ఏడాది పాపాయిని ఎత్తుకుని ఒక యువతి వచ్చింది అందరికీ నమస్కరించింది

మంజుల మొదలు నరికిన పూలచెట్టులా పడిపోయింది

ఫస్టుఎయిడ్‌చేసి ఆమెకి స్పృహ తెప్పించాడు సుందర్రావు

'క్షమించండి డాక్టర్. మేం దగాపడ్డ వాళ్లం అందువల్లనే మీకూ శ్రమ ఇచ్చాం మరి వస్తాం' అని లేచాడు చలమయ్య

భూషయ్య నోట మాట రాలేదు.

కారులో కాంతమ్మ శోకాలు తీసింది

# గొప్ప సంధానకారి

సర్ సిల్క్ దృష్టినాకట్టే ఉత్తేజకరమైన ముదురు రంగులలో. చక్కని లేత రంగులలో సాదా, చారలు మరియు గీతలలో సర్ సిల్క్ నాణ్యమైన గుడ్డలలో మీరు కోరేవన్నీ సమకూర్చే సూటింగులు మరియు షర్టింగులు మీకు చేకూర్చ గలదు మన్నిక గలవి మంచి నాగరికతాభిరుచులకు దీటైనవి వాడకానికి తేలిక. సరిగ్గా సక్రమమైన ధర







## సర్ సిల్క్
## పాలియస్టర్ సూటింగులు మరియు షర్టింగులు

ASP/SSI/751

సెల్లింగ్ ఏజంట్లు ఆంధ్ర ప్రదేశ్: కలకత్తా మర్చంట్స్ & ఏజెంట్స్ (ప్రై) లిమిటెడ్ 11 41-51 కందుల వారి వీధి విజయవాడ తెలంగాణ రుంగ్టా & కో ఎథేర్ గట్టి హైదరాబాదు కర్ణాటక: మోడరన్ డీలర్స్ (ప్రై) లిమిటెడ్, కెంపెగౌడ రోడ్, బెంగుళురు తమిళనాడు & కేరళ హిందుస్థాన్ డీలర్స్ లిమిటెడ్, 4, స్ప్రింగర్ స్ట్రీట్, మద్రాసు

అందరూ రాజారావు ఇంట్లో ఎలాగ పడ్డారో ఒక్క నీలమ్మకి తప్ప ఎవరికీ తెలీదు. నీలమ్మకూడా ఆశ్చర్యంతో ఉక్కిరి బిక్కిరి అవుతూనే వుంది. కారు ఇంటి ముందు ఆగే వరకీ రాజారావు ఇంట్లోనే వున్నాడు. రాజారావుకి ఈ మధ్య నీరసంగా వుంది. మొహంలో ఉషారులేదు. వంట్లో నెత్తురు లేదు. అస్తమానూ ఏదో ఆలోచించుకుంటూ వుంటాడు.

## *17*

కారు దిగి ఇంట్లోకి వస్తున్న వాళ్లని చూసి చిరునవ్వు నవ్వుతూ ఎదురు వచ్చాడు రాజారావు. నీలమ్మ దూకుడుగా లోపలికి వెళ్ళింది. మిగతా వాళ్లు నిస్సత్తువగా హాలులో కూలబడ్డారు. మంజుల మందం మీద వాలి పోయింది. 'ఎలా వుంది ఎగ్జిబిషన్?' అని పలకరించాడు రాజారావు.

భూషయ్య తలతిప్పి ఎటో చూసేడు.

'ఏం ఎగ్జిబిషనో నాయనా? దానికంటే మన 'మాజిక్కు' చాల బాగా వుంది' అంది కాంతమ్మ గుండెల్లో దుఃఖం పొంగి కట్టలు

# రంగుల వల

తెంచుకొని పొరలటానికి సిద్ధంగా వున్న వరదలా వుంది.

'ఇదిగో ఇలా రండి' అంటూ ఇంట్లోంచి నీలమ్మ పిలిచింది.

'ఏమిటి?' అంటూ రాజారావు విసుక్కుంటూ లోపలికి వెళ్ళేడు.

నీలమ్మ ఒళ్ళుజారి, 'మీరు ఇంత ముద్దు తక్కువ పనులు చేస్తారనుకోలేదు' అంది. 'తోటకూరకాడ దొంగిలించిన నాడే చెప్పక పోతివే లమ్మా, అని నేను ఆనాడే ఇటువంటి పనిచేస్తున్నావే అంటే మొదటికుండా వుండకుంటివి ఇప్పుడు నన్నని ఏం లాభం? ఇంతకీ ఏం జరిగిందేమిటి?'

'అయితే తప్పు నాదేనంటారు, ఏనా నాకెందుకు? మీరూ మీరూ ఎవరి ఏడుపులు వాళ్ళు ఏడవ్వండి, ఆ డాక్టరు తుర్రవాడు కనపడ్డాడు. నిజం బయటపడింది' అంది.

రాజారావు గుండెల్నిండా గాలి పీల్చాడు. అతని మొహం విప్పారి రక్తం పొంగుకొని వచ్చింది. 'ఎంత చల్లని వార్త చెప్పేవు నీలమణీ! చెప్పి, నా గుండెమీదభారం దించావు గదే ఇన్నాళ్లూ ఈ రహస్యం గుండెల్లోనే పెట్టుకొని కాపలా కాచి దాయలేక చిక్కి సగమయిపోయాను గదే' అంటూ వుషారుగా ఎగిరి గంతేసేడు.

రాజారావు కళ్ళలోనికి మెరుపువచ్చింది. మునుపటి జవసత్వాలు పొంగివచ్చేయి.

భార్య బుగ్గమీద చిటికె వేసి అన్నాడు 'ఆఁ తర్వాత ఏమయింది? అయితే కుండ బద్దలయి నిజం బయట పడిందంటావు. దానికదువు బంగారంగాను పీడా పోయింది గదా, ఇంతకీ తర్వాత ఏమయిందంటే చెప్పవేం?'

నీలమ్మ ఎలువ్రసుద్దు వేసుకుని చూసింది. పొంగి వస్తున్న కోపాన్ని ఆపుకుంటానికి ప్రయత్నించింది. 'ఏమయిందా? నా పిండా కూడు అయింది. చెపితే అప్పటికి వస్తున్న బయట ఎక్కడుకు సిగ్గులేక పైగా ఈ ఎంత వేషాలు కూడానా?' అంటూ విరుచుకుపడింది. కాసే వుంటే బుగ్గలు పొగిడిసి పిండుతుందేమోనని భయంవేసి గబగబా హాల్లోకి వచ్చాడు రాజారావు.

అందాలు చిమ్ముతూ
ఆకర్షణ వెద చల్లితే





## మీదారి పొడవునా
## చూపుల తోరణాలే !

లాక్మే వానిషింగ్ క్రీం మీ సౌందర్యానికి రాచబాట మంచులో తడిసి తొలికాంతిలో విరిసిన పూవులా మిమ్మ చేస్తుంది

శ్రేష్ఠమైన మేకప్‌కు అవశ్యవంతమైన ఆధారము లాక్మే వానిషింగ్ క్రీం. దీనిపై పౌడరు చాలాసేపు హత్తుకొనివుంటుంది

ఎంతో తేట అయింది, ఎంతో సహజమైంది, అయినా ఎంత మార్పును తెస్తుంది

**లాక్మే వానిషింగ్ క్రీం**

అద్దుకొన్న పౌడరును హత్తుకొని వుంచుతుంది.




మీ సౌందర్య పోషణ మా ప్రత్యేక ఆశయం

లాక్మే

HCP LVC 2 07Te




## రంగులవల

పాత్రసామాన్లతో యుద్ధం చేస్తూ వంట ప్రయత్నం ఆరంభించింది నీలమ్మ. జానకి లోపలికెళ్ళి ఆవిడతో చెప్పింది 'మేమెవరం తినము మామ్మా వదినా మాకెవరికీ వంటలు చేయమాక' అని. దాంతో నీలమ్మ మరింత రెచ్చిపోయింది నోటిదారి నోటిదే చేతి దారి చేతిదే వద్దన్నా నీలమ్మ చేతులు వంట ప్రయత్నం మానలేదు అందరికీ సరిపడేట్టుగానె బియ్యం నీళ్ళలో పడేసింది.

"ఊం ఏం బావయ్యా? అందరూ షేక్స్‌పియర్స్‌లా కూర్చున్నారు మంజూతల్లి మంచం ఎక్కింది ? ఇంతకూ ఏమయిందట?" అంటూ రాజారావే పలకరించాడు

అందరి తరఫునా చలమయ్య మాట్లాడేడు

'మేము కొన్ని విషయాలు అడిగి, నిజానిజాలు తెలుసుకుందామని వచ్చేము' అన్నాడు

'అడగవయ్యా బాబూ అడ్డమయిన అన్ని ప్రశ్నలకీ సమాధానాలు చెప్పటానికేగా నేను యిక్కడ వుంట? నీ ఇష్టమయిన ప్రశ్నలడుగు తప్పకుండా సమాధానాలు చెపుతాను అయితే ఒక షరతు ఆ తర్వాత నేనూ కొన్ని ప్రశ్నలడుగుతాను వాటికి నువ్వుగాని, నీకు తెలీకపోతే నీ అన్నగారు గాని సమాధానాలు చెప్పాలి?' అన్నాడు రాజారావు

చలమయ్య అడగటం మొదలుపెట్టాడు రాజారావు సమాధానాలు ఇచ్చాడు అందరూ శ్రోతలయేరు. అంతకంటె మిగిలిన ఎవరికీ ఓపికాలేదు. ధైర్యమూ లేదు

'రాంమోహన్ ఎవరు? సుందర్రావుకి ఏమవుతాడు?'

(ఇంకా వుంది)

## హైదరాబాద్ నోట్ బుక్

(42 పేజీ తరువాయి)

ప్రజల సహకారం ముఖ్యంగాని, ప్రభుత్వ యంత్రాంగమూ, ధనమూ కావని ఆయన స్పష్టపరిచారు.

### అంతర్జాతీయ తెలుగు అధ్యయన సంస్థ

దేశ విదేశాల విద్వాంసులు తెలుగు భాషా వాఙ్మయాలలో పరిశోధనాధ్యయనాలు జరపడం కోసం రాష్ట్రప్రభుత్వము అంతర్జాతీయ తెలుగు అధ్యయన సంస్థను (ఇంటర్నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ తెలుగు స్టడీస్) హైదరాబాద్‌లో నెలకొల్పడానికి రాష్ట్రప్రభుత్వం నిర్ణయించింది ఈ విషయాన్ని విద్యామంత్రి శ్రీ ఎం. వి కృష్ణారావు మార్చి 21న శాసనసభలో తెలియజేశారు ఈ సంస్థ ప్రపంచ తెలుగు మహాసభ ఆశయాలను, లక్ష్యాలను కొనసాగిస్తుందని ఆయన తెలిపారు

### ఉపశ్రుతి

"ఏమోయ్! పద్మశ్రీ బిరుదం వచ్చిన తరువాత నిన్ను అభినందించలేదు, అందుకో నా అభినందనలు" అన్నారు పద్మశ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులను "సరే, బాగుంది, ఎప్పుడో ఫ్రంట్ సీటు కూడా ఇవ్వరు పద్మశ్రీ గాళ్ళకు ఎందుకది?" అన్నారు ఆయన.

—తిరుమల రామచంద్ర

## డెట్ ఉతికే బిళ్ల

సబ్బు కంటె $1\frac{1}{2}$ రెట్లు ఎక్కువ శక్తివంతమైనది
ఉప్పు నీళ్లలో కూడ




## డెట్ ఉతికే పౌడరు

ఎంచుకొందుకు వీలుగా ఎన్నో సైజుల ప్యాకులు
మీరు చేయవలసినదంతా బట్టలను తడిపి
జాడించడమేను మీ చేతులను మృదువుగా కూడ
ఉంచుతుంది




## ఎన్ - డెట్

మరకలను తొలగించే ఎన్‌జైమ్ ఉతికే
పౌడరు గుణకరమైనది కాని పోని వెయ్యదు,




# ఇదివరకు ఎన్నడూ లేనంత తెల్లదనము—డెట్ ఉత్తమ తయారులతో!

Sailp HPMA 6A/74 Tel

కార్టూన్లు

హాస్యప్రధానమైన కార్టూన్స్ రాను, రాను లగ్నం చేసేనందుకు చాలా వివరంగా వుంది ఆహం—అనురాగం, సీరియల్ అద్భుతంగా వుంది. 'విలువలు' కథ చాలా బాగుంది.

పి.వి. రంగారావు (సీతానగరం)

## ఉత్తరాలు

లడ్డూ ధరలు

పెరుగుట, పెరుగుట కొరకే (ధరలు) అనే ఆధునిక సూక్తికి విరుద్ధముగా తిరుపతి వెంకటేశ్వరుని లడ్డు ధర ఒక రూపాయనుండి మూడు రూపాయలకు పెరిగి మరల 1 7 3 75 నుండి 2 50 కు తగ్గినది. అంటే పెరుగుట తరుగుట కొరకే అనే సనాతన సూక్తి నిజస్థితికి తెచ్చినది.

ఆ పరమేశ్వరుని దయవలన పైన బజారు ధరలు మిన్నంటక తగ్గుటకు సూచికేమో అని పైనంటున అనిపిస్తున్నది.

వాడాడ సింహాచలం. (పలాస)



Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3, Editor. S. Radhakrishna

## ఆమె పెరిగి పెద్దదైన చాలా కాలం తర్వాత కూడ ఆ ఫొటో గుర్తుంటుంది.

SIMOES/AG/2/75 TEL







ప్రతి 120 ఫిల్మ్‌రీల్ పైనా 12 పెద్ద (6×6 సెం.మీ.) ఫోటోలు వస్తాయి

ప్రత్యేకమైన ఎవర్-రెడీ లెదర్ కేస్ పోర్ట్రెయిట్ లెన్స్, మరియు ఫ్లాష్‌గన్ అదనపు ధరలో లభిస్తాయి

సుస్పష్టమైన ప్రింట్లు మరియు ఎన్‌లార్జ్‌మెంట్ కోసం అగ్ఫా-గెవార్ట్ ఫొటో పేపరునే కావాలని అడగండి

అగ్ఫా-గెవార్ట్ అధీకృత విక్రయదారులు అందరి వద్ద దొరకుతాయి



సోల్ డిస్ట్రిబ్యూటర్లు: అగ్ఫా-గెవార్ట్ ఇండియా లిమిటెడ్
మర్కంటైల్ ఛాంబర్స్, 41, న్యూ మెరైన్ లైన్స్, బొంబాయి-400 020

శాఖలు బొంబాయి, న్యూ ఢిల్లీ, కలకత్తా, మద్రాసు

® ఫోటోగ్రాఫిక్ వస్తువుల ఉత్పత్తిదారులైన అగ్ఫా-గెవార్ట్, అంట్వెర్ప్ లివెర్కుసెన్ యొక్క రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్కు

ఇండియాలో తయారుచేయువారు: ది న్యూ ఇండియా ఇండస్ట్రీస్ లి